# పీఠిక.




నాచే విరచింపఁబడిన పరీక్షిజ్జననమును పురాణసంబంధ వచనగ్రంథము పండితపామరులచే మిక్కిలి కొనియాడఁబడి యుండుటంబట్టి నేనిప్పు డీకంసవినాశనమును రచియించితిని. ఇదియును బైదానివలె బాలికాబాలకులకును వయోవృద్ధులకు ను నత్యంతోపయుక్తముగ నుండఁగలదని దృఢముగ నమ్ముచు న్నాను. చదువరుల కానందజనకముగ నుండునట్లుగఁ బటము లను బెక్కులను జేర్ప నెంచితిని గాని ప్రస్తుతము సాధ్యముగాక పోయెను. పునర్ముద్రణమునఁ జేర్చెదను. అచ్చటచ్చట భాగవత ములోని హృదయంగమంబులగు పద్యముల నీపాత్రంబునఁ జేర్చితిని. భాషాభిమానులెల్లరు నాయందుదయయుంచి యీ గ్రంథము నభివృద్ధికిం గొనివత్తురని నమ్ముచున్నాను. ఈగ్రంథ మునకు వలయుద్రవ్యము నొసంగి తోడ్పడిన నామిత్రులు చిట్టూరు అమ్మయ్యగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. తక్కుంగల పనుల నట్టులనే నిలిపి యీకృతినిఁ దమముద్రాక్షరశాలయందు యందు ముద్రించి సకాలమ్మునకు నాకందఁజేసిన యానందా ముద్రాక్షరశాలాధిపతులు నాస్తోత్రమున కెంతయుఁ బాత్రులు.

ఇట్లు,

కలబరిగి వేంకటరమణకవి.

క॥ మంగళములఁ బితరులకున్
రంగాంబా మల్లికార్జునవరేణ్యులకుం
బొంగుచు నర్పించెద సా
ష్టాంగ నమస్కృతుల భాసురామలభక్తిన్॥

క॥ శతలేఖన్యవధానుల
వితతోభయవాగ్విభూతి విశ్రుతయశులన్
మతిమంతుల గురువులఁ ది
ర్పతి వేంకట కవికులాభరణులన్ గొలుతున్॥

క॥ సురుచిర బృందారకభా
సురభాషావిమలవిభవశోభితు శ్రీసుం
దరరాజ తాత నామక
గురువర్యున్ వైష్ణవాధికున్ సేవింతున్॥

---

క॥ వేంకట పతిభక్తుండను
వేంకటకవి కుముదవిహితు ప్రియశిష్యుండన్
వేంకట రమణుఁడఁ గవితా
పంకజనయనాకటాక్ష పరిపాలితుఁడన్.





## మొదటి ప్రకరణము.

భరతఖండంబున నార్యావర్తమను పుణ్యభూమి గలదు. అందు యాదవ భూమీశులకు మొదలిపురియై మధురాపురంబు చెన్నారుచుండెను. పూర్వకాలంబున శూరసేనుఁడను యాదవేశ్వరుం డాపురంబును దనకు రాజధానిగఁ జేసికొని మాథురంబులు శూరసేనంబులను దేశంబు లేలుచుండెను. ఆరాజేంద్రునకుఁ బదుగురు కొడుకులును నేవురు కూఁతుండ్రును గలరు. వారలలోఁ బెద్దవాఁడు వసుదేవుఁడు. అతఁడు రూపగుణసంపత్తులఁ దక్కుఁగల రాజేంద్రులఁ దిరస్కరించుచుండెను. అతని ప్రఖ్యాతి నెఱింగి దేవకుండను యాదవేశ్వరుండు నిజపుత్రికను దేవకి నాతని కొసంగి వివాహ మొనరించెను. వివాహానంతరంబున నాతఁడు కూఁతునకు వస్త్రాభరణంబులను దాసదాసీజనంబులను జతురంగబలంబులను నరణంబులుగ నొసంగి యల్లునర్చించి సాదరంబుగ వీడుకొల్పెను. కంసుండు చెల్లెలిని మఱఁదిని గూర్చుండఁబెట్టికొని రథముఁ దోలుకొని పోవుచుండెను. అట్లు మహానందభరితుండై చను కంసునకు భయజనకంబుగ మింటనుండి యశరీరవాణి యిట్లని పలికెను.

ఏల యీత్రుల్లిపాటులు? ఏటికీ యభిమానములు? కంసా! నీగతి నీవుచూచుకొమ్ము. ఈతరుణి యష్టమగర్భము నీప్రాణముల హరించు. నమ్ముము. జాగరూకుఁడవుగమ్ము. ఆ

పలుకులాలించి కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడి దంబుగ జళిపించి చెల్లెలికొప్పుఁబట్టికొని యాడ్చి తోఁబుట్టు వని సైతము వెనుదీయక తెంపునఁదెగఁ్రవేయ గమకించెను. ఆతని వదనంబు క్రోధంబునం జేసి తరుణార్కుం దిరస్కరించు చుండెను. ఆతని నయనములనుండి నిప్పులురాలుచుండెను. అతఁడు పండ్లు పటపటఁగొఱుకుచు మొగముఁ జిట్లించుకొను చుండెను. దయయనునట్టిదో యాతనికడఁ గానరాదయ్యె.

అట్టిసమయంబున మిన్నకున్నఁ గార్యము దప్పునని యెంచి వసుదేవుం డతనిడగ్గఱి హితవాక్యంబుల 'బావా! యిదియేమి యాగడము? ఇట్టిది లోకంబున నెందైనఁ గల దే? నీవన్నవు. ఈతరుణి నీకుఁ దోఁబుట్టువు. పుట్టినింటివార లాడుఁబడుచులకు సొమ్ములిత్తురు. చీరలిత్తురు. భూములిత్తురు. మంచిమాటల నాదరింతురు. మఱిమఱి మన్ననలు సేయుదురు. లోకంబున నట్టివి పెక్కులుగలవుగాని యిట్టి విపరీతఁపు గొంతు కోఁతయెందైననుఁ గలదే. నీవెఱుఁగని ధర్మములు లేవు. మదోన్మత్తులగు వైరిరాజసింహుల రణంబున నను్కంపలేక తునుము నీకరవాల మిాయబలకంఠంబుపై నెట్లెగఁగలదు? ఏదియో యశరీరవాణి పలికెనని భ్రాంతిపడి నీవింతపనికిఁ దెగుట ధర్మనుగునే? నీకుఁ నేఁజెప్పఁదగినంతటివాఁడఁ గాను. అయినను జెప్పవలసెఁగానఁ జెప్పెదను.

మృత్యువు దేహముతోడన పుట్టును. పుట్టినవాఁడు నేఁడు ఱేపుగాకున్న నూఱేండ్లకైనఁ గిట్టియు తీరవలయు. తన తొంటికర్మము విడువక నీడవలెఁ దన్ననుసరించియ వచ్చు చుండును. 'బుద్ధిః కర్మానుసారిణీ' యనుట యెఱుంగుదువు.

దేహము లనేకములైనను గర్త చెడదు. నీటికుండల యందుఁ జంద్రసూర్యాదులు గానఁబడుచు గాలివలనఁ గదలునట్టు లాత్మ కర్త నిర్మితాంగంబుల యందు రాగకలితుఁడగుచుఁ బ్రాణిగద లుచుండును. కర్మములు మేలునిచ్చును. కర్మములు కీడు నాపా దించును. తనకైనను బ్రహ్మకైనను గర్మము లేక ర్తలు. కావున బుద్ధిమంతుఁడు సర్వము కర్మాధీనమని యెఱింగి యాత్మశుభము లకై పరులహింసింపఁదలంపఁడు. నీవు జ్ఞానవంతుఁడవు. మహాత్ము లువ్వాప్రతోఁబోవఁబోవుట నీకవశ్యము కర్తవ్యము. ఈమె నీకుఁ బుత్రికవంటిది. సర్వోత్కృష్టురాలు. ప్రాణభయమున వడవడవ డంకుచున్నయది. అయ్యో! భీరువులఁ జంపఁదగునే? మహాత్మా! నీకు మ్రొక్కెదను. ఈ మూత్ని వివాహను పదలుము. నాయందు దయఁదలఁపుము. చిరయశము సంపాదింపుమ'ని యనేక విధంబుల నీనుఁడై వేడుకొనెను.

ఎంతవేడుకొన్నను నాతనికి లవంబును గరుణగలుగ దయ్యెను. వసుదేవుఁ డాతని దృఢనిశ్చయంబెఱింగి విచారంబు నొంది 'యక్కటా! యీతఁడు దనకార్యమును మానఁడయ్యె ను. నాపల్కినహితవాక్యంబు లెల్ల బూదియందు హోమం బుచేసినయాజ్యంబుభంగి వ్యర్థములయ్యెను. ఏమిచేయు దును? వీనిని సన్మార్గంబునకుఁ ద్రిప్పునుపాయ మెద్దియుం దోఁపదు. వీఁడు మూర్ఖుఁడు. ఎవ్విధంబునను సంతోషింపఁడు. ఇనుమునందుఁ బ్రయత్నించినచోఁ దైలంబుఁ దీయవచ్చును. ఎండమావులయం దెవ్విధంబున నైనను నీరమును ద్రావ వచ్చును. తిరిగి తిరిగి చెవులపిల్లికొమ్మును సాధింపవచ్చును. దాఁపునఁజేరి యెంత తెలిపియును మూర్ఖులమనసు రంజింప

రాదు. మాకు దుష్టకాలము సంప్రాప్తించినది. అందులకై మనోవ్యథ నొందిన నేమిగలదు? ధైర్యము నవలంబింపవలయు. ధైర్యము సర్వసాధనము. కావున ధైర్యము నొంది చరియింతును. ఈమెకు జనియించిన పుత్రుల నెల్లఁ దప్పక యిచ్చెదనని యిప్పుడీతనితోనందును. అంతటితో నీతని కోపము చల్లారును. ఇప్పటి మాముప్పుదప్పును. కొడుకులు పుట్టినపిమ్మటఁ జూచుకొందము. కాలమెన్నటికి నొక్కరీతిగ నుండదుగదా? అప్పటికేదైన నడ్డమురాకుండునే? దైవమా! నిన్ను నమ్మితిని. నాయందు దయఁదలంపుము'ని తనలోఁ బలుగతుల వితర్కింపఁ దొడంగెను. అంత నాతని కధికధైర్యము గలిగెను. అప్పుడాతఁడు కంసుం జూచి 'యయ్యా! నీకేటికిఁ గోపము? ఈ లలనవలన నీకేహానియులేదు. ఈమె యెనిమిదవచూలుగదా నీకుమరణకారణము. అట్లగుటం జేసి యీమె గర్భంబున జనించినపుత్రులనెల్ల నీకర్పింతును. వారిని నీయిచ్చవచ్చినట్లు వధింపుము. పిమ్మట నీకేరివలనను బ్రాణభయంబు గలుగదు. నీవు కలకాలంబు సుఖంబుగ రాజ్యంబు సేయవచ్చు'నని తిన్ననిపలుకుల నమ్మకముపుట్టఁ బలికెను. అందుల కలరి కంసుండు 'వసుదేవా! నీచెప్పినవిధము మంచిది. నేనవశ్య మట్లు చేయుదును. నీవు మాటదప్పక పుట్టినబిడ్డల నెల్లఁ గ్రమముగ నాకర్పింపుము. దానంజేసి నాకుఁ బ్రాణభయంబు గలుగనేరదు. నీకును మేలగు'నని పలికి గుణాగ్రాహిత్వంబుఁగైకొని కొండలమందు చెలియలి మందలవిడిచి చనియెను. వసుదేవుండును డెందంబున నానందంబు నొంది యుండెను.

ఇట్లు గొంతకాలంబు సనిన యనంతరంబున దేవకి గర్భముధరించెను. క్రమము క్రమముగ నవమాసంబులు పూర్ణములయ్యెను. అంత నొక్కనాఁడు శుభలగ్నంబున నా మెకొక చక్కని పుత్రుఁడుపుట్టెను. కొడుకు పుట్టుటెఱింగి వసుదేవుండు దానుమున్నుఁ గంసునకిచ్చినమాటఁ దలంచుకొని కొంతచింతించి బిడ్డను గొని చని యాతని యెదుటఁబెట్టెను. ఆతని సత్యవాక్య పరిపాలనమునకు మిగులనచ్చెరువంది కంసుం డు ప్రహృష్టహృదయుఁడై 'బావా! కొనియాడఁదగిన వాఁడ వుగదా? మేలు మేలు. నీసత్యవర్తనమునకు మెచ్చితి. సత్య పాలనమునకై పుత్రవాత్సల్యంబు సైతముఁ దెగఁగోసిన వాని నిన్నుఁ దక్క నుఱియెవ్వరింగానము. బిడ్డనివలన నాకెద్దియు భయములేదు. వీనినిఁ గొని పొమ్ము. నీయష్టమపుత్రుండు నాకుమృత్యువఁట. వానిఁబట్టి వధించెద న'ని సాదరంబుగఁ బలికెను. అందులకు సంతసమ్ము నొంది కంసునిఁగీర్తించుచు వసుదేవుండింటికిఁ జనియెను. మృత్యుగృహమునుండి నిరపా యంబుగ వెలువడ్డ సుతుంగాంచి దేవకీదేవిపట్టరాని సంతో షంబున నెత్తుకొని యక్కునఁగదియించి శిరమువూర్కొని 'నాచిన్నియన్నా! నేనెంతపుణ్యమొనర్చితినిరా! పులినోటికండ జాఱిపడ్డగతి నిన్ను మగలఁగాంచితి న'నిముచ్చటదీర ముద్దు లాడుచుండెను.వసుదేవుఁ డామెంజూచి'తన్వీ! యేలసంతస మొం దెదవు?ఇల్లలుకఁగనే పండుగగునే?ఈకంసునితోడి చెలిమిపాము తోడి చెలాటము. వీనిని నమ్మఁదగదు. ఎయ్యదితలంచుకొని యెప్పుడుపైకొని వచ్చునో యెఱుంగరాద'నివైరివలని భయం

బునంజేసి పలికెను. అందుల కాతఁడు నిరుత్సాహంబున మొగ ముఁజిన్న పుచ్చుకొని యెద్దియుఁ దోఁపకమిన్నకుండెను.

---

# రెండవ ప్రకరణము.

కంసుఁడు దేవకుసోదరుఁడగు నుగ్రసేనునకుఁ బుత్రుఁడు. శౌర్యమున నద్వితీయుఁడు. ఆతనికి దోర్గర్వంబునఁ దీసిపోవని బాణాదినిశాచరులు ముఖ్యమంత్రులు. కంసుఁడు వారిలం గూడుకొని యాదవుల నెల్లఁ గదనంబున మదంబులడంచి పురంబులు విడిచివెడలఁదోలుచుండెను. ఆతని ధాటికాగఁ జాలక సదనంబులు విడిచి యదవలై యదువులు వదనంబులు వంచికొని నిలువక పరువులిడిరి. నిషధకోసలాదిబహువిషయ పతులు వారికి శరణులొసంగిరి. కొందఱు మచ్చరంబులు విడిచి యాతనిఁగొలిచి నిలిచియుండిరి.

కంసుఁడు వసుదేవునకు మగుడ నాతనిపుత్రునొసంగి వీడ్కొలిపి దేవకి యష్టమగర్భంబునకై తలఁచివేచియుండెను. ఇట్లుండఁ గలహాభోజనుండు నారదుం డొకనాఁడు మింటినుండి డిగి కంసునింటికరుదెంచెను. కంసుఁడమ్మునీంద్రునకెదురేగి లోనికిఁగొనివచ్చి యర్ఘ్యపాద్యాదులర్పించి పూజించి యంజలి ఘటియించి యిట్లనియె. 'మహాత్మా! మీపావనంపుఁ బాదర జంబుసోకుటంజేసి నేఁడుమాగృహంబు పావనంబయ్యె. నేను ధన్యుండనైతిని. ఎందుండియెందులకేగుచు నిందులకు వచ్చితిరి? మహాత్ములు కారణములేకరారు. మీరు తిరుగనిదేశంబులు లేవు. ఏయేదేశంబుల నేయేయద్భుతంబులు సూచితిరి?' నావు

డాతండు పిన్ననవ్వునగి 'కంసా! నాతిరుగని దేశంబులు లేవు. నా చూడనివారు లేరు. నాయెఱుంగనివిషయంబులు లేవు. ఎవ్వియును నాకద్భుతరబులుగఁగానరావు. ఈపట్టణంబున నీకడ నొక్కవిశేషంబుఁగంటి. అంతటినుండియు నాకు వచియింపనలవిగాని యాశ్చర్యము గలుగుచున్నయది. అది యెద్దియని యడుగుము. అడుగకున్న నేమి? చెప్పెదవినుము.

ఆశరీరవాక్కు నాలకించియు మూఢుఁడవై నీవు దేవకీతనయునిఁద్రుంపక కరుణించితివి. ఇంతకంటె నాశ్చర్యమెద్ది గలదు? దేవకి యష్టమగర్భంబుగదా నాకుఁబ్రాణాంతకంబని యెంతువుగానోపు. బాంధవులనియెంచి నీవు సంతసంబునొందుచున్న యీ దేవకీవసుదేవాదులెల్లరు నీకుబంధువులుగారు. శత్రువులు. విషసర్పంబులమధ్య సంచరించుచున్నావు. నీవు రాక్షసుఁడవు. వీరలెల్లరు దేవతలు. నీచావునకై యెదురుచూచుచున్నారు. నారాయణుండు దేవకీదేవకిఁ బుత్రుఁడై జనించును. అతఁడు నిన్నువధించును.. దీనికిఁ బ్రతిక్రియయోచించుకొమ్ము. చెప్పవలసినదంతయుఁజెప్పితి. పోయివచ్చెద న'ని వీణెమీటుచు నారాయణకీర్తనలు పాడుచు మింటికేగెను. పిడుగువఱువున వినఁబడిన నుడువునాలించి కంసుండు క్రోధఘూర్ణితమానసుండై కన్నులనిప్పులుఁ రాలఁ బండ్లుపటపటఁగొఱుకుచు 'ఏమి'కలహాశనునిపలుకులు? వీరెల్లరు సురలా? నేనసురుఁడనా? దేవకికి హరిజన్మించుటయు నన్నువధించుటయునా? కానిమ్ము. చూతము. నన్నెవ్వఁడు చంపఁగలఁడో కనుఁగొందమ'ని మండిపడుచుఁ గరవాలంబును జేఁబూని దేవకీవసుదేవులున్నయెడకరిగి వారినిరువురఁ బట్టియీడ్చి కారాగారంబునఁ ద్రోయిం

చెను. తక్కుంగలయాదవులెల్లరుఁ దమకుఁ బ్రళయము సంభవించినట్టులడలి యెందరుగుటకు నందుఁగానక తల్లడిల్లుచుండిరి. మౌనులు దమయజ్ఞముల కాతనివలన విఘ్నములగుటెఱింగి శైవమును బ్రార్థింపఁదొడంగిరి. లోకములన్నియు నల్లకల్లోలములుగనుండెను. దేవకీతనయులాఱుగురుననుకంపలేక చంపఁబడిరి. కొంతకాలంబునకు దేవకీదేవి యేడవగర్భంబుఁదాల్చెను. ఆగర్భంబునందు హరికాంతి చెన్నొందుచుండెను. అయ్యాది యెఱింగి హరితన్నునమ్మినయదువులకుఁ గంసునివలని భయంబుఁ బోకార్చువాఁడై యోగమాయంజూచి యిట్లనియె. 'భద్రా! నీవు గోపికాగోపకులుగల పసులమందకు శీఘ్రముగఁ బొమ్ము. అందు వసుదేవుభార్యలుకంసుచే నాఁకలఁబడియుందురు. వారిముట్టకుము. నందగోకులమందు రోహిణియను తరళాక్షి గలదు. ఆమెసుగుణాఢ్య. ఆమెగర్భంబున దేవకీకడుపున వెలుంగు తేజమును జొనుపుము. పిమ్మట నీవు నందుభార్యకు యశోదకు జన్మమొందుదువు. సర్వకామదాయినివగు నిన్ను జనులు కానికలు బలులు నిచ్చి కొలుతురు. నీవు దుర్గాదిపదునాలుగునామంబులచే విలసిల్లుచుందువు'. నావుడు మహాప్రసాదంబని హరికిమ్రొక్కి నందగోకులమునకుఁ జనుదెంచి యోగమాయ యామహాత్మునాజ్ఞఁ బరిపూర్తి గావించెను. రోహిణికి గర్భముగలిగెనని జనులద్భుతమునొందఁజొచ్చిరి. అంత శుభలగ్నంబున నామెకుఁ బుత్రుఁడు జన్మించెను.

ఇట్లుండ దేవకి యష్టమగర్భంబుఁదాల్చెను. అందు నారాయణుండు బాలార్కుభంగి నభివృద్ధినొందుచుండెను. దినదినాభివృద్ధినొందు దేవకిగర్భంబుఁగాంచి కంసుండు దలఁచు

వెఱచుచు నేకాంతంబునఁ దనలోనిట్లని తలపోయఁజొచ్చెను. 'అక్కటా! యీయతివ యిప్పటిగర్భంబు గన్నులకుఁజూడ బరువై తోఁచుచున్నది. ఇంతకుము న్నెన్నఁడునిట్లుండుటెఱుంగను. ఆకాశవాణివాక్కులు నిజమ్ములుగానోపు. కాకున్న నాకేల యింతటివెఱపుగలుగవలయు? ఇఁక నేమితలంపఁగలను. కార్యమెయ్యదియగు? నానాఁటికిఁ గామినిచూలు పెంపెసఁగుచున్నయది. ఈమె నాకుఁజెల్లెలు. మీఁదు మిక్కిలిగర్భిణి ఇట్టియీమానవతి నేమనిచంపువాఁడ? తెగువజేసి చంపితినేని నన్నుఁ గిరాతుఁడని లోకులుదూషింపరే. నాకీర్తి యడుగంటదే. ఆయువుక్షీణింపకుండునే. ధర్మము చెడిపోవదే. నేను జీవన్మృతుఁడనుగావలసివచ్చు. అయ్యో! పౌరుషజ్ఞానకీర్తులడుగంటఁ గేవల కుక్షింభరుఁడనై లోకంబున నెట్లు జీవింపఁగలను? ఈపతివ్రతను సంహరించితినేని నాకు నరకముదప్పదు. తెలిసితెలిసి యెట్లునరకకూపంబునఁ బడఁగలను? ఎన్నిగతులయోచించిచూచినను నీమెను జంపుటకు నామనంబొడంబడదు. కానిమ్ము. కానున్నది కాకమానదు. 'లలాటలేఖానపునఃప్రయాతి' యను పెద్దలనుడువులు మఱవఁదగవు.' కొంత తడవిట్లుచింతించి యతఁడు మగుడ ధైర్యమవలంబించి క్రౌర్యంబును ద్యజించి శౌర్యంబుఁ బ్రకటించి చెల్లెలిని జంపుతలంపునుమాని మానియై నిలిచెను. అయినను నాతనికి నానాఁటికిఁ దోఁబుట్టువు గర్భంబుపైఁ బగహెచ్చఁజొచ్చెను. ఏశబ్దము వినఁబడ్డను నతఁడది హరిపలుకని యులుకుచుండెను. ఏవస్తువుగానఁబడ్డను నయ్యది హరిమూర్తియని బెదరిచూచుచుండెను. దేహమ్మున కెయ్యదిసోకిన నదిహరికరాఘాతమని కదియుచుం

డెను. ఎట్టి గంధముగలిగిన నదిహరిమాలికాగంధమని యూఁద రుచుండెను. ఏదియైనను బలుకువలుకుచో భ్రమసి యతఁడు హరిపలుకుఁ బలుకుచుండెను. తలఁపులేవైనను గలిగిన నవి హరితలఁపులని యలుగఁ దలఁచుచుండెను. ఆతనికి సర్వమును హరిమయమనితోఁచుచుండెను. హరిహరియనుచు నతఁడితి రమునంతయును మఱచి తన్మయుఁడై చరియింపఁ జొచ్చెను.

అయ్యవసరంబున నమరులును నారదాదిమునులునుం గొలిచి రాముక్కంటియును దమ్మిచూలియును నక్కడకువచ్చి దేవకిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము ననేకభం గులఁ బ్రస్తుతించి దేవకింగాంచి 'యవ్వా! నిపుణ్యంబేమని వచియింపఁగలము? తపములను దానములను యాగములను జిక్కనిభగవంతుఁడు చిన్నబిడ్డయై నీగర్భంబునఁ బొలిచియు న్నాఁడు. ఎల్లిపుట్టఁగలఁడు. మీకేమాత్రమును గంసుచేభయ మింకఁగలుగనేరదు. మాకందఱికిని భద్రమగును. నీకడుపె ప్పుడును జల్లఁగావలెను. యాదవులెల్లరు సంతసంబునం బొం దుదుర'ని హరిం బొగడి దేవకీదేవిని దీవించి తమనెలవుల కరిగిరి.

## మూఁడవప్రకరణము.

జలదంబుల బృందంబులు కలఘోషణంబుల నుఱుమ దొడంగెను. సప్తసముద్రంబులు పరిశుద్ధంబులై పొంగు చుండెను. మందమందమలయానిలంబులు మెల్లమెల్లన వీవఁ జొచ్చెను. హోమాగ్ని మిగులఁజెన్నొంది వెలింగెను. గ్రహన క్షత్రసహితంబై నభోభాగంబు విరాజిల్లుచుండెను. ఆశాభా

గంబు లెక్కుడు తెలివిందాల్చెను. నిర్మలజలపూరితంబులైన దులు ప్రవహించుచుండెను. విహంగమంబులతోడ వనంబులు సెలంగఁదొడంగెను. గంధర్వులు దమగానరసంబుల నెల్లరకును గర్ణరసాయనము గావించుచుండిరి. రంభాదియప్సరోగణంబు లాడందొడంగిరి. మింట దేవదుందుభులు మ్రోసెను. గ్రహన క్షత్రంబు లధికశుభస్థితిందాల్చియుండెను. అట్టిసమయంబున నర్ధరాత్రమ్మున దేవకీదేవికిఁ బుత్రుఁ డుదయమయ్యెను.

'సీ. స్వచ్ఛంబులై పొంగె జలరాసులేడును
గలఘోషణముల మేఘంబులుఱిమె
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె
దిక్కులు మిక్కిలి తెలివిఁదాల్చెఁ
గమ్మని చల్లనిగాలి మెల్లనవీచె
హోమానలంబు సెన్నొంది వెలిగెఁ
గొలఁకులు కమలాళి కులములై సిరినొప్పెఁ।
బ్రవిమలతోయలై పాఱెనదులు।

తే॥ గీ॥ వరపురగ్రామ ఘోషమై వసుధయొప్పె
విహఁగరవపుష్ప ఫలముల వెలసెవనము
లలరుసోనలు గురిసిరయ్యమరవరులు
దేవదేవుని దేవకీదేవి గనఁగ॥

క॥ పాడిరి గంధర్వోత్తము
లాడిరి రంభాదికాంత లానందమునం
గూడిరి సిద్ధులు భయముల
వీడిరి చారణులు మొరసెవేల్పులభేరుల్॥'

చక్కఁదనంబుల కెల్ల నెల్లయగు నక్కొమరుం గాంచి వసుదేవుఁ డుత్సాహమొంది 'యాహా! యీపాపఁ డీపురు టింటికిఁ బెట్టని దీపంబువోలె వెలుంగుచున్నవాఁడు. నిజ ముగ నీతఁడు నలుమొగముల పాపనిఁ గన్న పాపండని తోఁ చుచున్నద'నుచు సాష్టాంగ దండప్రణామంబు లొనరించి యంజలి ఘటియించి 'దేవా!' నీవఖిలదర్శనుఁడవు. జ్ఞానా నందస్వరూపుఁడవు. మాయాదూరుఁడవు. స్వయంజ్యోతివి. ఇట్టి నిన్ను మేము తనయునిఁగాఁ బడయుట మాపూర్వజన్మ సుకృతము దక్క మఱియొండుగాదు. మింటిమ్రోతలు నమ్మి పాపియగు కంసుండు నీయన్నల నెల్ల సంహరించెను. నిన్ని ప్పుడు వధియింప సన్నద్ధుండై యున్నవాఁడు. నీయభీష్టము. మాభాగ్య మ'నిస్తుతియించెను. అంతట దేవకీదేవి ముకిళితకర కమలయై 'యీశా! నీవునాకుఁగొమరుండవై పుట్టుదువని కం సుండు పెద్దకాలంబునుండి వేచియున్నవాఁడు. మమ్ములఁ గారా గారస్థులనొనరించియున్నవాఁడు. వానినేప్రకారముఁ దుదము ట్టించి మమ్ముఁగాపాడెదవో యది నీభారము. మేము నోచిన నోము లెల్ల ఫలియించెను. మాకుఁబరమము క్తిగలిగెన'ని భక్తి తాత్పర్యంబులు ముప్పిరిగొన వేడుకొనియెను. అందులకుభగ వంతుండు సాక్షాత్కరించి 'యమ్మా! నీవు తొల్లిఁబృశ్నియను పరమపతివ్రతవు. వసుదేవుండు సుతపుండను ప్రజాపతి. మీరి రువురును సృష్టికాలంబున నలువపంపునఁ బంచేంద్రియంబుల జయిచి శీతవాతాతపంబులసైరించి యాకలములుభక్షించి వేంద్రడంబుగఁ బంద్రెండువేలదివ్యవర్షంబులు తపంబు సేసితిరి. అపుడేను నాదివ్యతేజంబుఁజూపి తిరంబులగువరంబులువేడుం

డంటిని. అందులకు మీరు పాయని మోహంబున బిడ్డలు లేని యడ్డంబున దుర్గమంబగు నపవర్గంబుఁ గోరక నాయీడు కొడుకునడిగితిరి. నేనద్దానికి మెచ్చి పృశ్నిగర్భుండన నర్భకుండనైతిని. అదియునుం గాక మీరలదితికశ్యపులరై యున్నయపుడు నేను మీకుఁ గుఱుచవేషంబున వామనుండనై జన్మించితిని. ఇది మూఁడవభవము. ఈజన్మంబునను నేనుమీకుఁ బుత్రుండనైతిని. కడచినదంతయుం జెప్పితిని. ఇటమీఁద నాకుమీయందు జన్మంబు లేదు. నన్నుఁ గొడుకని నమ్మికడపట నన్నుం జెందెదర'నుచు నారూపంబు విడిచియెప్పటి యట్లపసిబాలుండై తలిదండ్రులను జూచుచుఁ బరుండియుండెను. అంత వసుదేవుండు హరి కాలమతిక్రమించుచున్నదే పుత్రజననంబు విన్నఁ గంసుండు మండిపడివచ్చును. అంతఁ గార్యంబుదప్పును. ఇఁకఁ దడయంజనదని బిడ్డనిఁ గరముల లోమ్మున నడ్డంబుగఁ బట్టి తప్పటడుగులిడుచుఁ జప్పుడుగాకుండ మెల్లన గొల్లపల్లియవంకకు బయలెడలెను. అంతకుమున్న గొల్లపల్లెయందు నందుని సతికి యశోదకు యోగమాయ కూఁతురై పుట్టెను. అవ్విధంబందలి వారలెవ్వరెఱుంగక యొడళ్లుమఱచి నిదురించుచుండిరి. వసుదేవుఁడు నందునిమందం బ్రవేశించి యశోదశయ్యయందున నాచిన్నినల్లనయ్యనుంచి యయ్యవ్వకూఁతునెత్తుకొని మరల నింటికివచ్చి యచ్చిఱుతపాపను దేవకిప్రక్కనఁ బరుండబెట్టి యొక్కెడనొదిగియుండెను.

నందుని మందయందు యశోద గాఢనిద్రంజెంది యునికిం జేసి వనజాక్షునిఁ దెచ్చుటయుఁ దనసుతను గొంపోవుటయు నెఱుంగదయ్యెను. కొంతతడవునకుఁ గారాగారంబున దేవకి శయ్యఁబరుండియున్న బాలిక యావురని యేడ్చెను. ఆచప్పుడు

నకుఁ గావలివారు మేల్కాని నలుగడలఁ జూచిరి. తలుపులతాళములు దొంటిచందంబున నుండెను. అదిచూచి యధికసంభ్రమమ్మునఁ గొందఱు పరువులిడి చని కంసుతో దేవకి నీళ్లాడెనని చెప్పిరి. అతఁడు సిడిముడిపాటుతోఁ దల్పంబుపైఁ దత్తఱమ్మున లేచి పురుటింటివంకకుఁబరువిడెను. ఆతని శిగముడివీడెను. పైవస్త్రము వ్రేలాడుచుండెను. కన్నులనుండి యగ్నికణంబులు రాలజొచ్చెను. మొగమెఱ్ఱవారియుండెను. అతని కొడలు దెలియదయ్యెను. బాలఘాతుకుని రోషాతిరేకమ్ము నీక్షించి భయంబుగదుర దేవకితత్క్షణంబకూఁతునక్కునఁజేర్చెను. కంసుండాబిడ్డఁబట్టి చంపఁగదియ దేవికి యడ్డంబువచ్చి 'యన్నా శాంతింపుము. శాంతింపుము. నాపలుకులాలింపుము. మింటిమ్రాతలు దలంపుము. ఈబిడ్డను వధింపకుము. పుత్రుఁడు నీప్రాణమునకు శత్రుఁడనివింటివి. ఆఱుగురుబిడ్డలఁ జంపితివి. పుత్రులకునోచుకొననైతిని. ఈబిడ్డయాఁడుబిడ్డ. నిరపాయురాలు. నీకెట్టిహానియుఁ జేయఁజాలదు. అక్కటా! యీపొత్తులకందువును సైతముఁ జంపవలయునే. ఈదుఃఖమును నేనుభరింపఁజాలను. అన్నా! నీపాదములుపట్టివేడుకొందును. నన్నుక్షమింపుమా. యశమార్జింపుము. మహాత్ములు వ్రాపుత్రోవ ననుగమింపుము. నీతోడఁబుట్టువును. ఇంతటి స్వాతంత్ర్యమును వహింపఁజాలనే.

ఉ. 'అన్న శమింపుమన్న తగదల్లుఁడుగాఁడిది మేనగోడలా
మన్నన సేయుమన్న వినుమానినిఁజంపుట రాచపాడిగా
దన్న నుకీర్తివై మనఁగదన్న మహాత్ములు వ్రాఁపుత్రోవఁబో
వన్న భవత్సహోదరిఁగదన్న నినున్ శరణంబువేడెదన్.'

యని జాలిఁబడ నేడ్చుచుఁ బయ్యెదఁ జక్కఁ సవరించుకొను చుఁ బలవరించుచు భ్రాంతిఁ గొని కూఁతును నక్కునఁ జక్కఁ హత్తుకొని యుత్తరీయాంచలంబుఁ గప్పి పలుగతుల వేడుకొని యెను. ఆమె బ్రతిమాలుకొలందిని వానికిఁ గోపము హెచ్చు చుండెను. అంతి వాఁడు నిలువక తోఁబుట్టువుం ద్రట్టి యావలకు నెట్టి పొదిగిఁటనున్న చిన్నిపట్టి నొడిసిపట్టి బలిమికొలంది నేలపైఁ గొట్టెను. ఆబాల నేలపయిం బడక మింటికెగసి తన మొదలి తనువును వదలి దివ్యరూపంబు ధరించి కంసునీక్షించి పెద్దగొం తుకతోడ నిట్లని విలపించెను. 'ఓరీ కుటిలమానసా! దేవకి బిడ్డల నెల్లఁ జంపి యెంతటి పాపమార్జించితివిరా! అంతేఁ గాక మేఁటిమ గండవని నన్ను జాలనొప్పింపఁగడంగితివి. ఇదియు బీరమే. నీకు వినాశకాలము సంప్రాప్తమైనది. కావుననే యిట్టి విపరీతబుద్ధు లు వుట్టినవి. కానిమ్ము. ఎంతకాలము నీయాటలు సాఁగఁగలవు? నిన్నుఁ జంపెడివీరుఁ డొక్కఁడుఁ బుట్టివర్ధిల్లుచున్నాఁడు.

ములుకులఁ బోని యప్పలుకులకులికిపడి కంసుండు జళుకుఁగదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది దేవకీవసుదేవులం జేరి యాదరంబున నిట్లని పలికెను. 'అయ్యో! నేనెట్టి పాపుఁ డను! ఎంతటి బాలఘాతుకుఁడను! బయలి పలుకుల నమ్మితిని. మీబి డ్డల నెల్ల వధించితిని. బంధుగులకుఁ గష్టముఁ దెచ్చిపెట్టితిని. దుష్ట చిత్తుఁడనై బ్రాహ్మణుల నాశముఁ గావించితిని. చేయరానిపను లెన్నెన్నియో చేసితిని సాధువుల హింసించినవారికిఁ బుణ్యము లెట్లుగలుగును? కర్మానుసారులై ప్రాణులు లోకమునకు రాక పోకలు సేయుచుఁ జిక్కులొందుచుందురు. ఎన్నాళ్లకును దుదలు సేర నేరరు. సంసారమును బాయఁజాలరు. నేను వట్టిభ్రాంతి

నొందితిని. నేనెక్కడిహంతను? మీశిశువులెక్కడిహన్యులు? ఎఱుఁగక మిమ్ముదూఱితిని. నాతప్పులు క్షమించి నాకుఁ బ్రసన్నులుగండు.' ఇట్లనుచు నాతఁడు గన్నులనీరునించి వగచి దేవకీవసుదేవుల పాదంబులు పట్టుకొని సంకెలియలువిప్పించెను. వారును బరితుష్టుండైన కంసుంజూచి తమరోషంబులువాసిరి.

అంతఁ గంసుండు వారలయనుజ్ఞలువడసి గృహంబునకరుదెంచి యప్పుడ తనకుఁ బరతంత్రులగు మంత్రుల రావించి యోగమాయవలనఁ దావినినవృత్తాంతమంతయుఁ దెలిపెను. అందులకు వారలద్భుతభయాక్రాంతచిత్తులై యిట్లనిరి. 'రాజేంద్రా! యిందులకై యింతచింతయేల? మున్ను నీచేనొచ్చిన శాత్రవులను దోలుదోల్తు శోధింతము. వారు నీబాహుబలంబునకు వెఱచి యెందుడాగిరో తెలియరాదు. ఒకవేళ శివునిఁజొచ్చియైన నుండవచ్చును. లేక బ్రహ్మఁజెందియైన నుండవచ్చును. అట్లుగాక విష్ణువును సేవించియైన నుండవచ్చును. కాకున్నచో మౌనులై వనాంతంబుల నిల్చియైననుండవచ్చును. వారింతకు మున్ను నొచ్చియుండిరని మన మప్రమత్తులమైయుండరాదు. అట్లున్నచోఁ దప్పక కీడువాటిల్లును. వారు మననాశనమునకై మార్గములు వెదకుచుందురు. ఋణశేషము శత్రుశేషముండఁగూడనివని దేవరయెఱుంగని విషయములుగావు. వారలెన్నెన్ని వేషములనైన మనల బేలుపుత్తురు. వారిని వృద్ధినొందనీయరాదు. రోగములను బుట్టినపుడ నిర్మూలింపవలెను. అట్టులొనరింపనిచో నవి వృద్ధినొంది దేహమును నాశనమొనర్చును. మొలకలై వంగనివి మ్రానులై వంగునే? దేవతలకెల్లముఖరుండుచక్రి. ఆచక్రిధర్మంబునందుండును. గోవులు యాగములు

తపములు దమములు దయాసత్యములు శ్రద్ధాశాంతులు వేయేల సకలచరాచరాదిభూతంబులు విష్ణుదేహంబులు. వాని నన్నింటిని నిర్మూలనంబొనర్చితిమేని నాహరి యంతంబొందును. కావున నాలస్యమొనర్పక సమ్మంపుము. మేము చని పట్టణంబులయందును, బల్లెలయందును, మందలయందును బుట్టి పెరిగెడి శిశువులఁబట్టి వధించెదము. నిలింపులం జంపుదుము. తాపసుల యమునిపాలికంపుదుము. ఆవులను దూడలను ద్రుంతుము. బ్రాహ్మణుల వెడలఁదోలుదుము. నిగమంబుల నెల్ల విదారింతుము. లోకములను నశింపఁజేయుదుము'; నావుడు కంసుండలరి వారలంజూచి 'యమాత్యులారా! మీయుత్సాహంబులకు నాకెంతయు సంతసము. ఇది మొదలు మీారు మీా యిచ్చవచ్చినయట్లు సంచరింప ననుజ్ఞయొసంగితి. మనమున నను కంపవహింపవలదు. వైరులను మీామీాశక్తులకొలందిఁ బేరు లేకదోరింపుఁడు. వైరంబచనుఁడ'ని యాజ్ఞాపించి యంతిపురంబునకుం జనియెను.

అంత వారలు జేనియాజ్ఞ మాళిందాల్చి యచటినుండి కదలి పురములఁ జొరఁబడిరి.

---

## నాలుగవ ప్రకరణము.

అంతలోఁ దెల్లవాఱెను. మందలోనివారెల్లరు మేల్కనిరి. యశోద కన్నులువిచ్చి శయ్యపైఁ దనప్రక్కనఁబరుండియున్న పాపనింగాంచి సంభ్రమమ్మున నుప్పొంగుచుండెను. నందుండు దనకు నందనుండు వుట్టుటెఱింగి మహానందంబునొంది

నెఱవాదులగు వేదవిదులఁ బిలిపించెను. వారలరుదెంచి బాలు నాశీర్వదించి పుణ్యాహవాచనంబులు సదివిరి. జాతకర్మంబులు యథావిధినడుపఁబడెను. దుందుభులు మొరసెను. గాయకులు పాటలుపాడిరి. వందజను లనేకవిధంబులఁగీర్తించిరి. భద్రకాహళ నాదంబులు వీతెంచెను. వల్లవులు దమవాకిండ్లను మంగళతోరణంబుల నలంకరించిరి. ఎల్లయెడలను సాంబ్రాణిధూపవాసనలు బయల్వెడలుచుండెను. మందలందుఁ బసులు పసుపు నూనెలపసలఁ దనరుచుండెను. లేఁగలు క్రేళ్లుఱికి మసలుచుండెను. మదవృషభములు ఱంకెలిడఁజొచ్చెను. మొదవుల పొదుగులయందుఁ బాలుజల్లించెను. పల్లెయందలి గొల్లలందఱును సంతసంబున వసంతములాడిరి. గోపికలు దమలో 'మనయశోదయేమినోమునోచెనమ్మా. ఆమెకడుపునఁ జిన్నిమగవాఁడుపుట్టెనఁట. పోయిచూచివత్తము రండమ్మా'

'ఆ॥ వె॥ ఏమినోముఫలమొ యింతప్రొద్దొకవార్త
వింటి మబలలార వీనులలర
మనయశోద చిన్నిమగవానిఁ గనె నఁట
చూచివత్తమమ్మ సుదతులార''

యనుకొనుచు నొండొరులం బిలుచుకొనుచు నందునింటికి బయలుదేరిరి. ఎవ్వరినోటవిన్నను నందనందునిజననవార్తలే. నందు నింటికి వచ్చిన గోపికలకు యథావిధిమర్యాదలు జరుపఁబడెను. గోపికలును దాము గొనివచ్చినకానికల నర్పించిచిన్నికృష్ణునెత్తుకొని ముద్దాడిరి. కొందఱాబాలునికిఁ దలయంటినీళ్లు వ్రోసిరి. మఱికొందఱాతనిఁ దొట్లయందుంచి జోజోయనిపాటలువాడిరి.

క. "జోజో కమలదళేక్షణ
జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా!
జోజో పల్లవకరపద
జోజో పూర్ణేందువదన జోజో యనుచున్."

ఇవ్విధంబున నందయును దనివిదీర నాబాలునెత్తుకొని ముద్దులాడుచు సంతసించుచుండిరి. నందుఁడు దనకుఁ గొడుకు పుట్టిన వేడుక గొనసాగ రోహిణిఁబిలువఁబంచి చిత్రచేలంబులను మండనంబులనిచ్చి మన్నించెను. అదిమొదలుగ మొదవుల కదుపులు బొదువులుగలిగియుండెను. ఇట్లుండ నొకనాఁడు నందుఁడు గోపులరక్షకు దక్షులైన వారిని నియమించి మధురాపురంజని కంసునకు నేఁటేఁటం బెట్టెడి యరిఁబెట్టెను. కంసుఁడాతని సగౌరవంబుగ వీడుకొలిపెను. కంసుని వీడ్కొని నందుఁడు వసుదేవునింటికిఁజనియెను. దేవకీవల్లభుం డాతనిఁగాంచి యుప్పొంగెను. ఆతని బొందిప్రాణముఁ బొందినదియుంబోలెఁ బొలుపారెను. ఆతనికడకన్నులయందానందాశ్రువులు గ్రందుకొనియెను. ఇట్లుసంతసించి వసుదేవుండు నందునిఁగౌఁగిలించుకొని సుఖాసీనుంజేసి తనకొడుకువలని ప్రీతిదీపింప నిట్లనియెను. 'మిత్రమా! నిన్నుఁజూచినంతట నాప్రాణములు లేచివచ్చినవి. నా యాపదలన్నియు నశించినవి. ప్రాణంబులకంటెఁ బ్రాణంబుగనెంచు మిత్రునిఁజూచుట చచ్చిమరలఁబుట్టుటయ గదా? పలుపాటులొందువారల కొకచోనుండుటకగునే? ఏళ్ల వెంబడి కలిసిపోవు మ్రాకులన్నియు ననేకమార్గములఁ బోవుఁగాక. ఒక్కటిగానుండఁగలవే? సంతతి లేదని నీవుమిగుల

జింతించుచుంటివి. పెద్దవాఁడవైతివి. ఇన్నాళ్లకు నీకు సంతతి గలిగినందున నాకు మిగులసంతసము. సంతతిగలవాఁడు సౌఖ్యవంతుఁడు. సంతతిలేనివానిగతిఁ జెప్పవలసిన దేమిగలదు? అది యట్లుండనిమ్ము. నీపశువులు రోగంబులనొందకున్నవియా? ఆవులుపాలిచ్చుచున్నవియా? వాఁగులువంకలు జలసమృద్ధములై యుండునా? గోష్ఠప్రదేశములయందుఁ బులులు దుష్టులు సంచరింపవుగదా? ఘోషములుపాలుపొందుచున్నవియా? కాంతారభాగంబులయందుఁ బచ్చని పూరిజొంపములున్నవియా? గృహమేధి యాశ్రమ మెంతకష్టము? వానికొక్క సంతోషమును లేదు. పుత్రమిత్రులఁదనివిఁ దీరఁజూచువీలు లేదు. వారెల్లరు మరణించినను నాతఁడొంటిమనవలయు. నిన్నుఁ దండ్రిగను నీకాంతను దల్లిగను నమ్మి నీమందయందు నాకొడుకున్నవాఁడా?' నావుడు నందుఁడలుకతోడ వసుదేవుఁజూచి 'వసుదేవా! బాగాయెలెమ్ము. కొడుకులభ్రాంతితోడఁ దెలియక మాటలాడుచున్నాఁడవు. నీకుఁ బుట్టినకొడుకులనెల్లఁ గంసుఁడు హింసించెను. మీఁదుమిక్కిలి నీపుత్రికను సైతముఁ జంపఁగడంగెను. ఆబాల దైవాధీనంబునం జేసి మింటి కెగసిపోయెను. ఏలభ్రాంతిపడియెదవు? నీతొంటికర్మమిట్లుండ నూరివారల కొడుకులను నీకొడుకులనుకొన్న మేలగునే? మంచిది. ఇఁక నట్టి పలుకులుపలుకవలద'ని వచియించెను. అందులకు వసుదేవుండు 'నందా! నీవన్నటులనే కానిమ్ము. నీవువచ్చినపని యాయెను. మమ్ముఁగనుఁగొంటివి. ఇంక వేవేగ నింటికరుగుము. గోకులమునందు నుత్పాతములు దోఁచుచున్నయవి. వానికిఁ బ్రతిక్రియలను యోచింపు మ'నినుడివెను.

అంత నందుఁడు వసుదేవుని వీడ్కొని మందకుబయలు
దేరెను. మార్గమున నాతనికిఁ బ్రతీతంబులైన యుత్పాతం
బులు పెక్కులుదోఁచెను. అవిగాంచి భయపడి యాతఁడు
వసుదేవుపలుకులు దప్పవని యెంచుకొనుచు వడివడినడుచు
చుండెను. పల్లెలయందెల్లెడలను జనులు గలంతనొంది తల్ల
డిల్లుచుండిరి. తల్లులు బిడ్డలఁ గోల్పోయి యేడ్చుచుండిరి. బ్రాహ్మ
ణులు దమయజ్ఞములు విఘ్నములొందుటకుఁ జింతిల్లి గుమి
గూడి గుజగుజలాడుచుండిరి. పశువు లూరకయఱచుచుండెను.
వానికిఁ గారణములరసి నందుఁడు కంసానుచరుల దుర్నయంబు
లకుఁ జింతిల్లుచుఁ దనప్రయాణమును సాగించెను.

అంతకుమున్నె పూతనయనురక్కసి కంసుపంపున
బయల్వెడలి పల్లెలయందును బట్టణములయందును మందల
యందును గల బాలురనెల్లవధించుచుఁ బోయిపోయి నందుని
పల్లెను డాసెను. అందుఁ దనగుట్టెఱుకవడునని యెంచి యది
కామరూపిణియై తిరుగఁజొచ్చెను. ఇల్లిల్లు వెదకవెదకి దాని
కొక్కెడ నందునింట నొక బాలునేడ్పువినఁబడియెను. ఆ
యేడ్పువిని సంతసించి యది సుందరీవేషంబుఁగైకొని యింటి
లోనికరిగెను. దాని మోహనాకారముంగాంచి గోపికలు
లక్ష్మి తమ్ముధన్యులఁ జేయవచ్చినదని యాశ్చర్యంబునఁ జూడఁ
దొడఁగిరి.

పూతన లోన నెల్లెడలను బరికించుచుండెను. కొంత
తడవునకు దానికిఁ దొట్లియందొక బాలుఁడుగానవచ్చెను. ఆ
బాలుఁడు భగవంతుఁడగుటం జేసి దానికాపట్యము నెంచి
లోలోన నవ్వుకొనుచుఁ గాలును జేలును గదల్పక యూరకప

రుండి గుఱ్ఱుపెట్టుచుండెను. రక్కసి మెల్లన నుయ్యెలం జేరఁ బోయి బాలుని లేపి యక్కునం జేర్చి ముద్దాడుచుండెను. అది చూచి యశోదారోహిణులు భయమొంది డగ్గఱి 'యెవరమ్మా నీవు? మా బాలు నేల ముట్టెదవు? నీచను బాలుమా బాలున కక్కఱలేదు. పిలువని పేరంటము నీ కేటికమ్మా! నీదారిని నీవు పొమ్మని' నుడివిరి. అందుల కాకపటవేషధారిణి మాఱువలుకక నవ్వుచు బిడ్డను దొడలనడుమనిడుకొని యొడలు నివురుచు 'నాయనా! చన్నుఁగుడువుము'ని నోటఁబెట్టెను. బాలుఁడు మేల్కొన్నట్లు మెల్లనఁ గనువిచ్చిచూచి యొడలు విఱుచుకొని యావులించి దాని చన్నుఁ గుడువఁదొడఁగెను. ఒకటి రెండు గ్రుక్కలు పీల్చునంతకు దాని సత్వమెల్లఁ బ్రాణంబులతోడ బాలునుదరంబుఁ జొచ్చెను ప్రాణంబులు గోలుపోకంజేసి యారక్కసి క్రెవ్వునఁ గేకవేసి పెనుగొండవలె నేలపైఁబడియెను. దానిపాటునకుఁ గొండలతోడ భూమి యదరెను. నభంబున గ్రహనక్షత్రంబులు బెదరెను. ఆశాంతంబులందు మాఱుమ్రోఁత లెసఁగెను. లోకంబులు భీతిల్లి కదలంబాఱెను. గొల్ల లెల్లఁ దల్లడపడఁ జొచ్చిరి. కొంతతడవునకు గోపకాంతలు గలంగినమనంబుల దృఢపఱచుకొని యశోదారోహిణులం గూడి దాని భయంకరరూపంబుఁ జూచిరి. వారి యాశ్చర్యమునకు మేర గానఁబడదయ్యెను. కొంద'అబ్బా! యీ యాకారమొందైనఁగలదే? ఇదిరక్కసియైయుండున'నిరి. కొంద'ఱిది ప్రాణముతోడికొండ'యనిరి. కొందఱు 'దీనిదంతంబులు లాంగలదండంబుల కెనయగున'నిరి. మఱికొందఱు 'దీనినాసిక నగగహ్వరంబును ధిక్కరించుచున్నద'ని నుడివిరి. ఇంకఁ గొందఱు

దీనినేత్రంబులు చీఁకటి నూతులం బెనయుచున్న వ'నిపలికిరి. వేఱొకకొందఱు 'దీనికరచరణంబులు జాఁగుకట్టలంబోలియు న్నవ'ని చెప్పిరి. 'దీనికడు పింకిన చెఱువుతో నెనయుచున్నద'ని కొందఱనిరి. 'దీనిపాద వాఱుకోసులదూరమున్నద'ని మఱి కొందఱువలికిరి. ఇట్లందఱనేకవిధముల నుడువుచు దానిఘోర శరీరంబుపై భయములేక యాఁడుకొనుబాలునిడాసిరి. యశోద కొడుకుగుట్టు నెత్తుకొని యాతని కెట్టియుత్పాతంబులు గలుగ కుండునట్లు దీవించి రక్షసేసి తొట్లయందుఁబరుండఁ బెట్టెను.

కొంతతడవునకు నందుఁడింటికి వచ్చెను. యశోదాదు లాతనికిఁ గడచిన వృత్తాంతమునంతయుఁ బూసగ్రుచ్చినవిధం బునఁ దెలిపిరి. అతఁడాశ్చర్యంబునొంది వసుదేవుని మొఱుక కద్భుతంబంది యాతనిని యోగియని పొగడెను. పిమ్మట గొల్ల లనేకులారక్కసిదేహంబును గుఠారంబులచే నఱికి తమకుటీ రంబులకు దవ్వగు వటారంబున దహనముఁగావించిరి. అమ్మగు వదేహంబునుండి యగరుపరిమళముల పొగలు వెడలుచుండెను. గోపకులెల్ల రాపాపిశరీరంబున నట్టిసుగంధము వెడలుట కచ్చెఱువొందిరి. భగవంతుఁడు దేహంబు స్పృశించుటంజేసి యాత రుణి సకలదురితములువాసి పుణ్యలోకంబులు వడసెను. నం దుండు బాలుఁజేరి యాతనిచేతలకు వెఱఁగుపడి యెత్తుకొని శిరంబుమూర్కొని ముద్దాడి మోదంబున నుండెను.

---

## అయిదవ ప్రకరణము.

కృష్ణుండు క్రమక్రమముగ నొదికిలఁబడనేర్చెను. అ య్యది మొదలింగి నందుఁ డాతనిజన్మనక్షత్రంబున నొకనాఁడు

పండుగుఁగావించెను. విప్రులు వేదమంత్రంబుల నభిషేచనాదులొనరించిరి. నందుఁడు వారికి గోదానంబులొనర్చెను. వారు బాలుని దీర్ఘాయుష్మంతునిగ దీవించిరి. బంధువులెల్ల రమ్మహోత్సవమునకు వచ్చియుండిరి. ఇంట నెక్కుడుసందడిగనుండెను. యశోద గోపికలకుఁ బూజలొనర్చుచు బాలునిమఱచెను. కొంతతడవునకు బాలున కాఁకలియయ్యెను. అందువలన నాతఁడు పెద్దపెట్టున నేడ్చుచుండెను. ఎవ్వరును వినిపించుకొనరైరి. అంత నతఁడు కోపమొంది కాలికడనున్న బండినొకదానిం దన్నెను. ఆతన్నున కాశకటము వికటంబుగ నేలఁబడియెను. అదిచూచి గోపకులాశ్చర్యమొందిరి. ఆబండియందుండు సరస పదార్థంబులు వ్యర్థంబులై నేలంగూలెను. అవియట్టులఁగూలుటకుఁ గారణంబెఱుంగక యశోదానందులు బహువిధంబుల వితర్కింపఁదొడంగిరి. ఎంత వితర్కించినను గారణము దెలియ రాదయ్యెను. వారి వాక్కులెఱింగి యందాడుకొనుచుండిన బాలురు జరిగినవృత్తాంతమును సాంతముగ వచియించిరి. ఆపల్కులు నమ్మఁజాలక నందాదు'లిసీ! యెక్కడిబాలుఁడు? ఎక్కడిబండి? ఎక్కడివిఱుగఁదన్నుట? ఇట్టిచోద్యమెందైనఁగలదే? ఈయాటపడుచు లనృతంబులాడిరి. ఇయ్యది యిట్లైయుండఁ జాలదు. దీనికెద్దియైన నితరకారణముండనగున'ని యూహ కుండిరి.

అంత యశోద బాలునెత్తుకొని పాలిచ్చెను. బాలుఁడు గడుపారఁదల్లిపాలుద్రావి యామెతొడలపై నాడుకొనుచుండెను. యశోద యాతనిముద్దాడి యొడలునివురుచుండెను. అంత

కంతకు బాలుఁడు బరువై తోఁచెను. ఆమె యాతని మోయఁ జాలక వెఱచి భూమిపైనుంచి 'యిది యేమి విపరీతము? బాలుఁ డింత బరువయ్యెను. ఇది యేమి నా భ్రమయా? నిజముగ నిట్లయ్యె నా?' యని తనలోఁ దాను వితర్కించుకొనుచు నది తనవట్టి భ్రాంతియని సమాధానముఁ జేసికొనెను. బాలుఁడు క్రిందసల్లారు ముద్దుగా నాడుకొనుచుండెను.

అంతలో నున్నటులుండి తృణావర్తుఁడను రాక్షసుఁ డొక్కఁడు సుడిగాలియై వచ్చి యాడుకొను బాలు నెత్తుకొని విను వీధి కెగసెను. ఆసుడిగాలికి ధూళి యెగసి గోపకుల కన్నులను నింపెను. వారలు కన్నులను దెఱువఁజాలక తొట్రుపడుచుం డిరి. కొంతపడికి గాలి తగ్గెను. ధూళి మాసెను. అందఱుఁ గన్నులు దెఱచిరి. బిడ్డ గానఁబడఁడయ్యె. అవ్విధంబెఱిఁగి యశోద తొట్రుపడుచు నిటునటుఁ జూచుచు దిగ్భ్రమఁ జెంది యెద్దియుం దోఁపక యయ్యో! పుత్రకా! పుత్రకా! యెందుఁ బోయితివి? ఇప్పుడిందాడుకొనుచుంటివే! ఇంతలో మాయమైతివే! ఈపాడు సుడిగాలి యెందుండి వచ్చెను. అయ్యో! ముద్దులపట్టీ! నిన్నెడఁ బాసి నేనొక్క క్షణమైనఁ దాళఁగలనా? గోపికలారా! మీ రేమైనను జూచితిరా? ఈవైపరీత్య మెందైనఁ గలదఁటమ్మా! యని యందుండు వారలనెల్ల నడుగుచుఁ జూచిన చోట్లను మఱల మఱలఁ జూచుచు నిటునటు దిరుగుచు నందునితోడఁ జెప్పెను. నందుఁడును గోపాలకులఁ గూడుకొని యెల్ల యెడలను వెదకెను. బాలుఁ డెందునుగానఁబడఁడయ్యె. అం[illegible]ల్లడిల్లుచు నటునిటు పరువిడుచుండిరి.

తృణావర్తుఁడా బాలునాకసంబునదూరంబుగఁ గొంపోవఁదొడంగెను. అంతకంతకుబాలుఁడాతనికి బరువగుచుండెను. ఆభారము మోయంజాలక యాతఁడు భయభ్రాంతుఁడై 'ఘుదేమియాశ్చర్యము? నేనీలాగుబాలుని మున్నెన్నఁడునుఁ జూచియెఱుంగ. ఇది పుడమిలో లేనిచిత్రముగనున్నట్లుతోఁచుచున్నదని యెద్దియుఁ జేయునదిలేక కదలమెదలక నిలువంబడియె. భగవంతుఁడానిమెడ గట్టిగబిగియఁబట్టి పీడించెను. ఆబాధకుఁ దాళఁజాలక వాఁడు విలవిలఁదన్నుకొనుచుఁ బెనుగొండవలెఁ బుడమిపయింబడియెను. శిశువు వానిమెడను వదలక వ్రేలాఘుచుండెను. గోపిక లాచిత్రంబుఁగాంచి దిగ్భ్రమఁజెందిరి. కొంతవడికిఁ దెలిసి యశోద యయ్యెడకుఁ బరువిడి వచ్చి బిడ్డనెత్తుకొనియెను. నందుఁడానందమొందెను. 'మీపూర్వపుణ్యంబునఁ జేసి మీబిడ్డను మరలఁగంటిరి. యశోదమ్మతల్లీ! నీనోములపంట నీపూజాఫలము నీతనయుఁడు నీకు మగుడదక్కెను. నీవు ధన్యవు. నీకేహానియుఁ గలుగఁజాలద'ని గోపికలు సంతసింమచు యశోదను నుతించిరి.

ఇట్లుండ నొకనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుండు గర్గుండు నందునిమందకుఁ జనుదెంచెను. నందుఁడాతనిఁగాంచి లేచి నిలువంబడి కృతాంజలియై భజియించి తగుసత్కారంబులాచరించి యిట్లనిపలికెను. 'మహాత్మా! మీరాకచే నేఁడు మాగృహము పావనంబయ్యెను. మేము ధన్యులమైతిమి. భవాదృశులగుపుణ్యమూర్తులు మాయిండ్లకూరక రారు. చిరకాలమునుండియు నాకొక్కకోరిక గలదు. అయ్యదితీర్చి న్నుధన్యుం జేయవేడెద. ఈకుమారులు సంస్కారములేక

యున్నారు. మీరు జ్యోతిశ్శాస్త్ర పారంగతులరు. తేజోమూర్తులరు. దిగంతవిశ్రాంత కీర్తియుతులరు. వీరికిసంస్కారంబు గావింపుఁడు.' నావుడు గర్గుండు నందునింజూచి యోగమాయావృత్తాంతంబు సాంతంబుగ వినిపించి 'నందా! యీబిడ్డఁడు దేవకీకొడుకు. ఈసంగతిఁ గంసుఁడెఱుఁగఁడు. ఇదిపరమరహస్యము. వానిచెవిఁబడినచోఁ దప్పకముప్పువాటిల్లును. కావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యంబు. ఇది మఱువవలద'నియె. అందులకునందుఁడు సంభ్రమపరీతచేతస్కుండై 'పుణ్యపురుషా! నేనవశ్యము మీయాజ్ఞ ననువర్తింతును. ఇంతకంటె నాకేమిగావలయు న'నిపల్కెను. అంత యాదవపురోహితుండు రోహిణీతనయుఁజూచి యీబిడ్డఁడు జనులు రమియింపఁదిరుగుచుండును. అందువలన నితఁడు రాముఁడనంబరఁగును. యదుసంకర్షణంబునం జేసి సంకర్షణుండనిపిలువంబడును. ఘనబలంబున బలుఁడని పేర్కొనఁబడునని కృష్ణునిదిక్కు మొగంబై యీబాలుఁడింతకుమున్ను ధవళారుణపీతవర్ణుండై నెగడెను. ఇప్పుడు నల్లనయ్యెను. కావునఁ గృష్ణుఁడనంబరఁగును. వసుదేవునకు జన్మించినకారణంబున వాసుదేవుఁడనంబడును. ఈపాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబు లనేకంబులుగలవు. ఈశాబకునివలన మీరుదుఃఖంబులఁ దరియింతురు. ఈయర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జన రక్షణంబును నగును. ఈకుమారుఁడు నారాయణసమానుఁడని పలికెను. నందుఁ డత్యంతానందమునొంది గర్గు ననేకసత్కారంబులఁ బరితృప్తుం జేసి సాదరంబుగ వీడుకొలిపెను. గర్గుఁడు గృహంబున

కరిగి వసుదేవునకుఁ దనపోయివచ్చినవృత్తాంతమును దెలిపెను. బాలు నభివృద్ధివిని దేవకీవసుదేవులు ప్రహృష్టహృదయులైరి.

నందగోకులమందు బలరామకృష్ణులు దినదినప్రవర్ధమానులై గోపబాలురఁగూడికొని యాడుకొనుచుండిరి. కృష్ణుఁడు దక్కంగల గోపబాలురంజూచి యొక్కతఱి 'నేను గోవల్లభుఁడను. మీరుగోవుల'నుచు వంగి అంకెవైచుచు నాడును. మఱియొకతఱి 'నేను దొంగను మీరింటివార'ని వారిని నిద్రపుచ్చి సొమ్ములుదొంగిలించుకొని పోయి డాగుకొనును. వేఱొకతఱి 'నేనుసూత్రధారుఁడను. మీరునాటకపాత్రల'ని యందఱి నాటలాడించును. అప్పుడప్పుడు బాలురతోఁ బందెములువేసి పరువులెత్తును. దాఁగురుమూతలాడును. బంతులెగురవైచును. చెట్లులెక్కిదూకును. చిన్నతనంపుఁజేష్ట లనేకములు సేయుచు నానందించుచుండును.

కొన్నితరుణములయందు బలరామునిఁగూడి కృష్ణుఁడు గోపాలురయిండ్లకరిగి నవనీతములను భక్షించుచుండును. బాలెంతలు తమబిడ్డలకుఁ బాలులేక మొఱలిడుచుండ వినక యాతఁడావులకు దూడలనువిడుచుచుండును. కడవలలోని కాఁగినపాలు ద్రావి వట్టికడవలను బగులమోదుచుండును. కొన్ని యిండ్లయందుఁ బాలయుట్లెత్తుగనుండ నాతఁడు ఱోళ్లుబోరలించి పీటలువేసి యెక్కి కుండలకుఁ దూట్లువొడిచి పాలన్నియుఁద్రావును. కొందఱిబిడ్డఁజోరఁబడి కుండలలోని నెయ్యిద్రావి యాకుండల నితరులయిండ్లయందిడును. అంతనాయింటి వారికి నీయింటివారికిఁ దగవుపడును. వేలుపులగోడలపై నుమిసి పాడుజేయును. గొల్లపల్లెయందలివారు కృష్ణునిరాకకు భయ

పడి ఇండ్లు మూసికొని తాళంబులువేసికొని వీధులనుందు రు. అతఁడు వారెఱుఁగకుండ లోనికరిగి పాలు పెరుగును ద్రా వును. తలుపులుదీయునంత కందళయిండ్లయందు నాడుచుఁ బాడుచుండును. ఇట్లతఁడు సేయుచుండ గోపిక లోపికలు శేక యశోదకడకేగి యోయమ్మా! మీబిడ్డ డెంతదుకువాఁడమ్మా! మీపాపనిచే మేము గృహములువిడిచి యెందేనియుఁ జనవలసి నట్లున్నది. మాయిండ్ల పాలు పెఱుగు నిలుచునట్లులేదు. మీరు భాగ్యవంతులైన బాగుగఁదినుఁడు. చక్కనివలువలుగట్టుకొనుఁ డు. మంచినగలుపెట్టుకొనుఁడు. బిడ్డలను బడుగులకొంపలపై విడువఁదగునే? మాకుఁ బోరాములగుచున్నయవి. మేమెందై నఁ బోవుదుము. ఇంక నిందునిలువమనిపలికిరి. ఆపలుకులాలించి

క. ఓయమ్మ నీకుమారుఁడు
మాయిండ్లను బాలు పెఱుగు మననీఁడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ.

యశోద తనకొడుకును దండింతునని సమాధానపఱచి గోపికల నిండ్లకంపును.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

గోపికలు దసతల్లితో నివ్విధమునఁ గొండెములు సెప్పుచుండఁ గృష్ణుఁ డెద్దియు నెఱుంగని వానిభంగి భయాన్వి తుండై యూరకుండును. అంత నొక్కనాఁడు బలరామాది గోపకుమారులు వెన్నుండు మన్నుఁదినెనని యశోదతోఁ జెప్పిరి.

ఆమె వానికేలువట్టుకొని యిట్లనియె. నాయనా! మన్నేటికిఁ దినియెదవు? తినవలెనన్న మఱిపదార్థము లేదా? మీయన్నయు గోపకుమారులును జెప్పుచున్నారుగదా! దుడుకుదనములు మానుమురా! అనవిని యాతండు దల్లింజూచి 'మన్ను దినుటకు నేను వెఱ్ఱివాఁడనటమ్మా! ఆకలిగొంటినటమ్మా! వీరిమాటలు నీవు నమ్ముదుమమ్మా! నన్నుఁ గొట్టింపవలెనని వీరందఱు జేరి యీయుక్తిఁ బన్నుచున్నారమ్మా! కాదేని నానోరు చూడుమమ్మా! తప్పైనదండింతువు గాక' యని కరుణపుట్టఁ బలికి నోరుదెఱచి చూపెను.

ఆతని వదనంబున సకలబ్రహ్మాండ భాండంబులు గానఁబడియెను. అయ్యదిచూచి వెఱగంది యశోద 'యిదియెక్క వింత? ఇదికలయా? వైష్ణవమాయయా? ఇతర సంకలార్థమా? సత్యమా? నేనుయశోదాదేవినా? కానా? ఇదినాయిల్లా? పరస్థలమా? అట్లుగాదేని నీబాలుఁడెంత? వీనిమొగంబున నీబ్రహ్మాండ భాండంబులుంటయెంత? దీనికెద్ది హేతువు? ఈతఁడు చూపునకు బాలుఁడుగనున్నాఁడు. నిజముగ బాలుఁడుగాఁడు. ఈతఁడు సర్వాంతర్యామియైన నారాయణుండని నాకుఁదోచుచున్నది. ఇంతకాలమ్మునుండి నేనీతనిఁ గొడుకని నమ్మితిని. అది విశ్వసనీయము గాదు. ఈమందయు నాభర్తయు నేనును నీగోపజనులును నీతని వదనమున నున్నాము. నాకుఁ దరుణముదొరకెను. ఈ సర్వాత్మునాశ్రయించి యిఁకఁ గడతేరవలయున'ని తలంచుకొనుచు భ్రాంతిఁజెంది నిలుచుండెను. భగవంతుం డదియెఱింగి యిఁకమిన్నకున్నఁ గార్యము

దప్పునని యామెయందు వైష్ణవమాయం బొందించెను. అంత నామెచిత్తవిభ్రాంతినిఁ బాసి యాబాలునిఁ దనకొడుకనియెంచి తొడలపై నిడుకొని ముద్దులాడఁ దొడంగెను.

ఒకనాఁడు యశోద పెరుగుఁ దరుచుచుండెను. కృష్ణుఁడు గంతులువైచుచు వచ్చి యామె కొంగుఁబట్టుకొని పాలిమ్మని యడిగెను. యశోద యాతనిని దొడలపై నిడుకొని పాలిచ్చి పీటపైఁ గూర్చుండఁబెట్టి పొంగుపాలుదించుటకై లోనికరిగెను. అందుల కతఁడు కోపమునొంది కడవలలోని వెన్ననంతయు మెసవి ఱాలతోఁ గడవలన్నిఁటినిఁ బగులఁగొట్టెను. కొంతవడికియశోదవచ్చెను. బాలుఁడచట లేఁడు. కుండలన్నియు భిన్నములై యుండెను. అంత నామె చేత సెలగోలఁ బట్టుకొని యాతనిని వెదకికొనుచు బైలుదేరెను. వెన్నుఁడు ప్రక్క యింట నొక ఱోలుఁదరుగవేసి యెక్కి యుట్టిమీఁది వెన్నను దినుచుండెను. అదిచూచి యామె వానిని డగ్గఱి 'మీరెవ్వరు శ్రీకృష్ణులుగారా! ఎన్నఁడును వెన్న నెఱుఁగరఁట. దొంగతనము నేరువరఁట. ఇట్టినియతులు లోకమందుఁగలరా?

'క॥ మీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁటకదా!
చోరత్వం బించుకయును
నేరరఁట ధరిత్రి నిట్టినియతులు గలరే? ॥'

యని పట్టుకొనఁబోయెను. బాలుఁడు ఱోలుదూఁకి పరుగిడఁదొడఁగెను. యశోదయాతని వెన్నంటి పరుగెత్తెను. ఎంతపరుగిడినను నామెకుబాలుఁడు చిక్కఁడయ్యెను. అలసట

మిక్కుటమగుడు నామె మఱిపరువెత్తలేక యందునిలిచి యబ్బా వీనిదుడుకుఁదనము నానాఁటికి నెక్కుడగుచున్నయది. వీఁడు చెప్పినమాట వినుటలేదు. ఇంటనిలుమన్న నిలువఁడు. పసివాఁడు లెమ్మని యూరివారలూరకుందురా? నాతోఁ గొండెములు సెప్పుచుందురు. నేనువానిని దండింతునని వారికేమైనఁ గరుణగలదా? వాఁడు శిక్షనొందినవారికేమి? నెమలికంట నీరు గారినవేఁటగానికిముద్దా? కాకిబిడ్డ కాకికిముద్దు. నాబిడ్డఁడు నాకెక్కువ. అట్లని యూరకుందునా వారలకుఁ గోపములు వచ్చును. దండింతునందునా లేక లేక కలిగినబిడ్డ. ఎట్లుచేయుటకును దోఁపదు. ముందుఁజనిననూయి వెనుకకేఁగినగోయి. అయ్యోపాపమను కొలఁదిని వీనికొంటెతన మెక్కువగుచున్నది. వీనిని దండింపవలెను. దండనమునఁగాని బాలురు చక్కఁబడరని సెలగోలజళిపించి 'బాలకా! నీదుశ్చేష్టలుమఱిమఱి యెక్కువగుచున్నవి. నిన్ను నేను మార్గమునకుఁ ద్రిప్పలేననియా యిట్లు చేయుచున్నావు! నీవు పట్టువడవేని నిన్నుఁగఠినముగ దండింతును. చూడుము'నుచు మఱల వానివెంటనరిగెను. తల్లిదన్నుఁగొట్టునని భయము నొందినవాఁడు వ్రాలెనాబాలుఁడు యశోదకెదురై 'యమ్మా! యీతప్పుసైపుము. ఇఁకమీఁద నిట్టిపనులుసేయను. చేసిన నన్నుఁగొట్టుము'ని యేడ్చుచుఁ గన్నులు నులుముకొనుచు నామెను డాయఁబోయెను. యశోద వానివినయమునకుఁ గోపముడిగి వెన్నదొంగ చిక్కెనని కొట్టఁజాలక పట్టుకొని ఱోటికిఁ గట్టఁదలఁచెను. ఎన్నిత్రాళ్లుగాని వచ్చినను వాని నడుముచుట్టుఁదిరిగి రావయ్యెను. క్రొత్తత్రాడుఁ జేర్చుకొలఁది నొకమూరతక్కువగు

చు నేయుండెను. ఇంటఁగల రజ్జువులన్నియుఁ బూర్ణములయ్యెను. బాలుఁడు గట్టువడఁడాయెను. అంత నామెయొడలఁ జెమట లెగయ నుత్తరీయముజాఱఁ గొప్పువీడఁ బూవులురాల నూర కరోజుచు నిటునటుజూచుచు నిలువఁబడెను. కృష్ణుఁడయ్యాది యెఱింగి బొజ్జఁబెంపునొందింపక సంకుచితము గావించెను. యశోద వానింగట్టెను. ఇట్టులు పట్టినితోటికి గట్టిగఁ గట్టి యాయమ యింటిపనులు చూచుకొను చుండెను.

అంతఁగృష్ణుం డామె నేమఱిచి ఱోలీడ్చుకొనుచుఁ బోవఁ జొచ్చెను. దారియందు రెండు పెద్దవృక్షము లొకదానికొకటి యంటియుండెను. వానికర్జున తరువులని పేరు. కృష్ణుఁడు వాని రెంటికి నడుమఁ దన ఱోలుదూరవనిచ్చి యీడ్చెను. అతని బలిమి కాసంగడిమద్దులు మహాభీలధ్వనితోడ భూమిపైఁగూలెను. అట్లుగూలిన సాలంబులలోన నుండి కీలికీలలువెల్వడు పోలికి సిద్ధులిద్దఱు వెడలివచ్చి లోకపాలుఁడైన బాలునకుమ్రొక్కి నిలిచిరి. భగవంతుఁడు వారినిమన్నించి సెలవొసంగి యని పెను. వారు దేవదేవుననేకవిధంబులఁ గీర్తించుచుఁ దమ దారింజనిరి.

తొల్లి నలకూబర మణిగ్రీవులను నిరువురుయక్షులుం డిరి. వారు కుబేరునకుఁ బుత్రులు. శంకరకింకరులు. మదోన్మత్తులై వారువెండికొండపైఁ బూదోఁటలయందుఁ గొందఱు చేడియలంగూడి క్రీడించుచుండిరి. బ్రహ్మమానసపుత్రుఁడు నారదుఁడొకనాఁడు వారున్నయెడ కరుగుదెంచెను. చెలువ లమ్మునిరాక నెఱింగి తమవలువలుధరించిరి. నలకూబరమణి

గ్రీవులు మదిరాపాన పరవశులగుటంజేసి వివస్త్రులై మెలంగు చుండిరి. మునీశ్వరునకువారిఁజూచినంతఁ గోపమువచ్చెను. అప్పు డతఁ 'డౌరా వీరిపొగరు! వీరికిఁగన్నులుగానరావు. ఇది సంపద వలనిమదము. సంపన్నుఁడు సంసారమును నమ్మి యితరులఁ గానలేఁడు. దరిద్రుఁడెత్తువడి శుష్కభూతుఁడై చిక్కియితరుల హింసింపఁడు. అతనికన్నుల కెల్లరు సములు. కావున సంపన్ను నకంటె దరిద్రుఁడుమేలు. సంపన్నంధునకంజనము దారిద్ర్యము. ఒక్కత్రుటిలోన వీరిక్రొవ్వడఁగింతున'ని వారిదిక్కు మొగంబై 'యక్షులారా! మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకం బున నర్జునతరువులై పుట్టి నూఱుదివ్యవర్షంబులు జీవింపుఁడ'ని శాపంబిచ్చెను. కొంతతడవునకు వారొడలెఱింగి మునీంద్రుఁ డొసంగిన శాపంబునకు వగచి తన్మోచనంబునకు మార్గముఁ జూపుమని యామహనీయుని వేడిరి. నారదుండు వారలఁ గరుణించి యిట్లనియె. 'కొండొకకాలంబునకు భగవం తుఁడు కృష్ణుఁడై భూలోకమున నవతరించును. ఆపురుషోత్త ముని పాదసంస్పర్శంబున మీశాపంబులు దొలంగును. మీరు ధన్యులరగుదురు.' అనవిని వారలు సంతసంబునొంది యమ్మహ నీయుఁ గీర్తించుచుఁ దమదారి నరిగిరి. నారదుండును వాసు దేవుని స్మరించుచు వియన్మార్గంబునం జనియె. పెద్దలనవమానిం చిన ననర్థములు సేకూరును. అయ్యది యెఱింగి ప్రవర్తింప వలయు.

సాలంబులు వడినచప్పుడు పిడుగుచప్పుడుగ వినఁబడ భయపడి నందాదులు పరుగున యాదెసకరిగిరి. మద్దులునేలఁ బడియుండెను. ఱోలువానినడుమనుండెను. బాలుఁడు చెక్కు

జెమర్పక నిలిచియుండెను. అదిచూచి యందఱు నిదియాశ్చర్య ముగనున్నది. పిడుగుపడదాయె. పెనుగాలి వీవదాయె. అర్జున మ్మలు పడినవి. ఇతఁడు బాలుఁడు. వీనిని గూల్పనసమర్థుఁడు. ఇవిపడుటకుఁ గారణమెద్దియొ యుండునని యనేకభంగుల వితర్కింపఁదొడంగిరి. అందఱిబాలురు వారిసందేహమును దీర్ప నెంచి జరిగినవృత్తాంతమును సాంతముగఁ దెలిపిరి. గోపకులాబాలకుల పలుకులు మిథ్యలుగనెంచి 'మనబిడ్డఁడుబ్రదికె. ఇఁకనీకారణంబు మనకుఁ దెలియకున్ననేమి? మనము లేచిన వేళమంచిద'ని బాలుఁదోడ్కొని యింటికరిగిరి.

కృష్ణుఁడెద్దియు నెఱుఁగనివానివలె మిన్నకుండెను. బలరామాదు లాతనిఁబ్రశంసించిరి. అంతివారంద ఱాటలాడ మొదలిడిరి.

---

## ఏ డ వ ప్ర క ర ణ ము.

'ఇఁకనిందు మనము నివసించు మార్గము గన్పట్టదు. ఇక్కడ రక్కసులు పెక్కులున్నవారు. మనకృష్ణున కాపద లనేకములు గలుగుచున్నయవి. భగవంతునకు మనయందు దయదప్పినట్లున్నది. ఎక్కడికేనియుఁ బోవుదము. పయనముగం డ'ని యుపనందుఁడను నొక వృద్ధగోపకుఁ డొకనాఁ డితరగోపాలురఁ గాంచి పలికెను. వారెల్ల రాతనిపలుకు లాదరించి పోఁదగుచోటొక్కటి నిరూపింపుమని కోరిరి. ఉపనందుఁడు గొంతయోచించి వారలంగాంచి 'గోపాలకులారా! కాళిందీత

టంబున మునీంద్రబృందావనమగు బృందావన మొండు గలదు. అందుఁ బసులకుఁ గసవువిశేషముగఁ గలదు. తోటలు పెక్కులున్నవి. ఆతోటలు మిక్కిలి రమణీయములు. అందు సుందరములు తరుబృందము లొప్పారుచుండును. అదియు మనకు నివాసయోగ్య మగుచోటు. మనమెల్లర మచ్చటికిఁ బోవుదము. ఇది నాయభీష్టము. మీాయిష్టమె ట్లట్లయోచింపుడ'ని తెలియఁబలికెను. ఇతరగోపకులెల్ల రావృద్ధగోపకుని యభీష్టము సరియనిరి. అంత నొక మంచిముహూర్తంబున గోపాలకులు ప్రయాణోన్ముఖులైరి. కొందఱాలమందలం దోడ్కొని ముం దరిగిరి. వారివెనుక మఱికొందఱు బాలవృద్ధనారులాక్రమించిన తేరులఁబోవనిచ్చిరి. వారివెనుకఁ బ్రౌఢులగు మఱికొందఱు గోపకులు తనుత్రాణతూణబాణధనులై విండ్లు పట్టుకొని నడిచిరి. బండ్లను వెన్నంటి యింకఁగొందఱు తూర్యరావంబులతోడ నార్య పురోహితసమేతులై బైలుదేరిరి. మార్గంబునఁ గొందఱు స్త్రీలు శ్రీకృష్ణలీలలు గానముచేసిరి. రోహిణీ యశోదలు రథంబులపై రామకృష్ణుల ముందటనిడుకొని వారలవినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుండిరి.

ఇంతలో బృందావనంబువచ్చెను. అయ్యది యత్యంత మనోహరమై కన్నులకుఁ బండువుసేయుచుండెను. గోపకులా యూరుఁజొచ్చిరి. శకటంబులెల్ల నర్ధచంద్రాకారంబుగ నిలుపంబడియె. యశోదాదులు రథంబులుడిగిరి. అందఱకుఁ దగు విడుదు లేర్పఱుపఁబడియె. మహానందంబున నందఱుఁ దమ తమ యిక్కువలఁజేరి సుఖంబుగఁ గాలముఁబుచ్చుచుండిరి.

రామకృష్ణు లీడుజోడుబాలురతో నల్లారుముద్దుగానాడు కొనుచుండిరి. కొంతకాలమ్మునకు వారు గోవులుగాయఁదలంపుఁ గొనిరి. తలిదండ్రులు వారియభీష్టముల కొప్పుకొనిరి. తోడి బాలురు గొందఱు వారిఁగూడుకొనిపోవ సమ్మతించిరి. ఒకనాఁ డందఱును జలిదియన్నంపుఁజిక్కములుభుజములకుఁ దగుల్చుకొని నిడుదలగు కఱ్ఱలను జేతనుంచుకొని బయలుదేరిరి. ముందు గోవు లేగుచుండెను. కృష్ణుఁడు చేతఁ బిల్లనగ్రోవినుంచుకొని యూదుచుండెను. ఆనాదమున కందఱు నానందపరవశులగుచుండిరి. మార్గముఁ దప్పిచనిన గోవుల నదల్చి కొందఱు మందలోనికిఁ జేర్చుచుండిరి. నడుమనడుమఁగొందఱొకరినొకరు హెచ్చరించుకొనుచు నెద్దియోని వింతలుచూచి విని వినినవ్వుచుఁ జప్పట్లుచఱచుచు గొల్లున నఱచుచుండిరి. కొందఱు పురాణకథలఁ జెప్పుచుండిరి. కొందఱూఁగొట్టుచుండిరి. కొందఱట్లుగా దట్లని యాక్షేపించుచుండిరి. ఇవ్విధంబున నందఱును జనిచని యమునాతీరంబునఁ బచ్చనిపుఱిజొంపముల గోవుల మేయఁదోలి యందందు నాటలాడుచుండిరి.

ఇట్లాడుకొనుచుఁ గృష్ణుఁ డొకవింత క్రేపుంజూచి బలరామునింబిలిచి 'యన్నా! చూడుము. ఇదియొకమంచిలేఁగ. ఇట్టిది మనమందయందు మఱియొండు గానరాదు. దీనితోడ నాడుకొన నాకు బుద్ధిపొడముచున్నయది. దీనినిఁ బట్టుకొనియెదన'నుచు దానితోక నొకచేతఁబట్టుకొని చేరువనున్న యొకవెలఁగమ్రాని కీడ్చిమోదెను. ఆపెట్టుతోడ వత్సరూపముందాల్చియున్న యసురుఁడు చచ్చెను. వానియాకారము నీక్షించి

తక్కుంగల గోపబాలకు 'లబ్బా! వీడెక్కడిరాక్షసుఁడు? తాటి ప్రమానిపొడుగున్నవాఁడు. వీనిచేఁబడకుండఁ గృష్ణుఁడు మనప్రాణంబులు రక్షించె న'నుచు భగవంతునిఁ బొగడఁదొడఁగిరి.

ఆలోన సూర్యుడపరవార్ధిఁ జేరెను. కులకులగూయుచుఁ బక్షులు దమకులాయంబులఁ జేరఁబోవుచుండెను. గోపకులు దమకదుపులఁదోలుకొని యిండ్లకు బయల్వెడలిరి. గోవులు గొట్టంబులఁ గట్టఁబడెను. తలిదండ్రులు దమ తనయుల రాకలకు హర్షించిరి. గోపబాలకులు వేఁడినీటుజలకంబులాడి ధౌతవస్త్రంబులు దాల్చిరి. యశోదారోహిణులు దమబిడ్డలకు బంగరు కంచంబులువెట్టి మృష్టాన్నంబులు నడ్డించిరి. తల్లులువెట్టిన యన్నంబుఁదిని చేతులుగడిగికొని యాబిడ్డలు దమ పగటిచేతలెల్లఁ దెలియఁజెప్పిరి. కృష్ణుని సాహసమున కచ్చెఱునంది యాంద ఱాతనిఁబొగడిరి. తమబిడ్డలు సురక్షితముగ వచ్చినందులకు నందయశోదలు సంతసించిరి. బలరామకృష్ణులు శయ్యపైఁబరుండి సుఖముగ నిద్రించిరి.

అరుణోదయంబున నందఋను మేల్కాంచిరి. రామకృష్ణులు కాల్యకృత్యములం దీర్చికొని యితరగోపబాలురం గూడుకొని గోవులఁదోలుకొని బైలువెడలిరి. పచ్చికబయళ్లయందు గోవులు మేయుచుండెను. అంతలో మధ్యాహ్నమాయెను. ఎండమిగులఁ దీక్ష్ణముగఁగాయుచుండెను. క్రిందఁగాళ్లూనవలను గాకుండెను. తలలు మలమలమాడఁజొచ్చెను. నోళ్లెండిపోవుచుండెను. క్రేపులు దప్పిగొని మోరలుపైకిఁబెట్టుకొని యూరక నిలువఁబడియుండెను. అదిచూచి గోపకులు వానినొకకొలంకు

నకుఁదోలిరి. అందుదిగి పసులు దనివిదీర నీరుద్రావెను. బాలు రును దమదప్పిఁదీర్చుకొనిరి.

ఆకొలంకు కెలంకున నొక్కబకము నిలిచి యుండెను. దానియొడలుమిగులఁబొడవుగనుండెను. దానికన్నులు సగము మూయఁబడియుండెను. అదియెద్దియో ధ్యానము సేయుచున్నట్లు గన్పట్టెను. గోపాలురు దానియాకారమును వెఱఁగుపడిచూచుచుండిరి. కొంతతడవట్లు మిన్నకుండి యదిచంచువు సవరించుకొని పక్షంబులువిచ్చి పదంబులెత్తి నింగికెగసెను. అట్లెగసి యది మఱలభూమికిడిగ్గి యచటనిలిచియున్న చిన్నికృష్ణు నొడిసి మ్రింగెను. కృష్ణుఁడు గనఁబడఁడాయెను. గోపబాలకు లాతనిపోఁబడి యెఱుంగక భయభ్రాంతచిత్తులై యూరక చిత్తరువులవలె నిలువంబడిరి. హరి బకాసురుని కంఠంబునుండి లోని కేగక రెండుచేతుల నాతనికంఠంబును దౌడలను బీడించెను. ఆపీడనకుఁదాళఁజాలక యాగ్రముక్కడి రక్కసుఁడు హాలుసివెడలఁగ్రక్కెను. కృష్ణుఁడు గ్రిందఁబడి యాతని మెడఁగట్టిగఁ బట్టి వంచి చంచువులను రెంటినిఁ జీల్చివైచెను. రాక్షసుఁడు ప్రాణంబులుగోల్పోయి భూమిపయింబడెను. రామాదు లానందమొందిరి.

అంత వారు గోవులఁదోలుకొని మఱియొక్కెడ కరుగుచుండిరి. అయ్యది చూచి బకదానవునితోఁడఁబుట్టు 'వయారే యీదుండగీఁడులు మాయన్నను బంచత్వమునొందించిరి. నామగంటిమిపీరెఱుంగరు. కంసుఁడు నాశక్తి గాంచియ కదా యీపనికినియోగించెను. వీరినెల్ల నొక్కక్షణంబున మ్రింగివైతును.

మాయన్నకు హితముగావింతును. ఈబుడుత లిటువచ్చుచు చున్నారు. రానిమ్ము'అనుచు నొక యజగరంబై పడియుండెను.

అంతలో గొల్లబాలురు దారిఁ జనుచుండి దూరంబున నొక మహా పర్వతంబుఁ బోని యీ పామును గాంచి 'యిది యెక్కడి పర్వతము? ఇది మనము చనుమార్గమే కదా! మన మార్గమధ్యంబునఁ గొండలేదు. మనమేమి మార్గము దప్పితిమా' యనుకొనుచుండిరి. కొంత సమీపమునకు వచ్చి నంత వారి కది పాముని తోఁచెను. కొందఱు దాని యాకృతిఁ గాంచి 'యిది యెక్కడి సర్పము? దీని నిడివి యొక యోజనంబునకంటె నెక్కుడుగ నున్నది. ఎత్తు పర్వతంబును మించుచున్నయది. దీని కోఱలు మన నాగళ్లను బోలుచున్నవి. దీని పెదవులు దట్టములగు మొగిళ్ల ననుకరించుచున్నవి. దీని యిగుళ్ల సందులు పెద్ద బిలంబులం బోలుచున్నవి. దీని వదనాంతరాళంబంధకార బంధురంబై చూపట్టుచున్నయది. దీని దృక్కులనుండి దావాగ్ని కీలలు వెల్వడుచున్నయవి. దీని విష నిశ్శ్వాసంబులకుఁ బరిసరంబులందలి చెట్లు మాడిపోవుచున్నవి. ఇది నేల నాలుకలు పఱచుకొని యున్నది. అబ్బా దీనిని డాయ భయము వొడముచున్నద'ని నిలిచిరి. మఱికొందఱు 'భయము లేదు. నడువుఁడు. బకాంతకుఁడు కృష్ణుఁడు మనకుఁ దోడుండ భయపడనేల? వీఁ డజగరాసురుఁడు. బకాసురు ననుగమింప నున్నాఁడు. రం డీతని వధఁ గన్నులారఁ గాంతమ'ని నిలిచిన వారినిఁ దోడ్కొనిచనిరి.

వారినిఁ జేరువకు రానిచ్చి యీ పాము తన వదనగహ్వరంబుఁ దెఱచెను. అందఱును దాని నోటఁ జొరఁబడిరి.

అంతఁ గృష్ణుఁడు వారల మౌర్ఖ్యమునకు మిగుల నొచ్చుకొని 'నేనున్నానను ధైర్యమునంజేసి వీరందఱును దీని గర్భంబుఁ జొచ్చిరి. ఇట్టి మూర్ఖులెందైనఁ గలరే. వీరి విడిచియుండఁ జాలక నేనును దీని నోటఁబడితిని. ఇఁక దీనిఁ జంపు మార్గ మెయ్యది ? మా కొఱకై యింటఁ దలిదండ్రు లెంత చింతిల్లు చుందురో. కానిమ్ము. దీని నిప్పుడ యమసదనంబున కంపుదు' నని తన దేహముఁ బెంచెను. అసురున కుచ్ఛ్వాస నిశ్శ్వాసము లాడవయ్యెను. కొంత తడవునకు వాఁడు గిజగిజఁ దన్ను కొనుచుఁ బ్రాణంబులు విడిచెను. కృష్ణుఁడు వాని శిరంబు భేదించుకొని తోడివారలఁ గూడికొని బయటికి వెడలెను. గోప బాలుర యానంద మేమని వచియింపనగు ? కొందఱు కృష్ణునిఁ గౌఁగిలించుకొనిరి. కొందఱాతని పాదంబులకు మ్రొక్కిరి. కొందఱు చిందులు ద్రొక్కుచుఁ బాటలుపాడిరి. కొందఱు దమ నొంగళ్లె నెగురవైచి పట్టుకొనుచుండిరి. వారి సంతోష మింతింతయని చెప్ప వశముగాదు.

కొంత తడవునకా సర్పము దేహమ్మునుండి యొక వెలుఁగువచ్చి కృష్ణునిఁ జొచ్చెను. గోపకు లెల్లరుఁ దమ మందఁ దోలుకొని యిండ్ల కరిగి నాఁడు జరిగిన వర్తమానంబు లెల్ల నిండ్లలోఁ జెప్పిరి. గోపకులెల్ల రద్భుత భయాక్రాంత చిత్తులై కృష్ణునిఁ బొగడిరి. యశోద కృష్ణునికి దృష్టిదోషము దగులకుండఁ గట్టుదిట్టములు గావించెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

---

మఱునాఁ డరుణోదయంబున మేల్కాంచి రామకృష్ణులు కాంతారంబున బంతిచల్దులు గుడువనుద్యోగించిరి. యశోదారోహిణులు చలిదికావడు లాయత్తముచేసి యిచ్చిరి. శృంగంబులు పూరింపఁబడెను. అధ్వనివిని తక్కంగల గోపాలురెల్లరు మేలుకని తమతమ క్రేపులం దోలుకొని బయలువెడలిరి. మార్గంబున వారధికోత్సాహులై బాల్యచేష్టలం జేయుచు నానందించుచుండిరి. మణిభూషణభూషితులయ్యుఁ గొందఱు చెట్లపూవులు దొడవులుగ నిడుకొనిరి. కొందఱు వేణువులు పూరించుచుండిరి. కొందఱు తుమ్మెదలంగూడి పాడుచుండిరి. కొందఱు మయూరంబులతోడ నాడుచుండిరి. పికంబులంగలసి కొందఱు కూయుచుండిరి. కొందఱు శుకంబులం జేరి రొదలు సేయుచుండిరి. పులుఁగులనీడలఁ గొందఱు వాఱుచుండిరి. పొదరిండ్లఁ గొందఱు దూఱుచుండిరి. వాగులయందుఁ గొందఱీదుచుండిరి. కొందఱు మరాళములచెంత నడుచుచుండిరి. కొందఱు బకములంగని నిలుచుచుండిరి. సారసంబులంజూపి కొందఱలంచుచుండిరి. కొందఱు నదీజలంబులం దోఁగుచుండిరి. తీవయుయ్యెలలఁ గొందఱూగుచుండిరి. పల్లంబులఁ గొందఱుడాఁగుచుండిరి. కొందఱు దూరంబులకేగుచుండిరి. కపులసందడిఁగొందఱు తరువులెక్కుచు ఫలంబులు మెక్కుచుండిరి. కొందఱు కయ్యంబులకుఁ గాలుద్రవ్వుచుండిరి. కొందఱు చెలంగుచుండిరి. కొందఱు మెలంగుచుండిరి. కొందఱు వ్రాలుచుండిరి. కొందఱు

సోలుచుండిరి. ఇట్లందఱనేకశరీరవికారంబులు సేయుచుఁ దనువులు మఱచియుండిరి.

కొంతతడవునకు వారొక పచ్చికబయలునఁ జేరిరి. ఆవులు దమదారిని మేయుచుండెను. అందఱును దమచలిదికావడులు వరుసగ దించిరి. వారిలో నొకఁడింకొకనికావడి యడకించి దాఁచెను. మఱియొకఁడు దాని నెత్తుకొనివచ్చి మొదటివానికిచ్చెను ఒకఁడు గజ్జముఁ దినుచుండ మఱియొకఁడు దాని నెగురఁదన్నెను. వేఱొకఁడు వానికడఁ జేరి పెద్దబొబ్బవెట్టెను. వాఁడులికి క్రిందఁబడెను. మఱియొకఁడు వానిని హేళనఁ జేసెను. తుట్టతుద కందఱిం జూచి కృష్ణుండు 'బాలకులారా! మీ చేష్టలింకఁ జాలింపుఁడు. ప్రొద్దుమధ్యాహ్నమాయెను. ఎండయందు విశేషమ్ముగ గ్రమ్మితిమి. ఆఁకలియగుచున్నయది. మీమీమూటలు విప్పుఁడు. చల్దిగుడుతము'ని పల్కెను. అప్పలుకుల కొఁగాక యని గోపాలకులు దమతమపసులకు నీరువెట్టి యెప్పటియట్ల మేయవిడిచిరి.

అంత నందఱును దమతమ చిక్కంబులు విచ్చిరి. కృష్ణుండు నడుమఁ గూర్చుండెను. తక్కినవారాతనిఁ జుట్టికూర్చుండిరి. ఆకులయందుఁ గొందఱును జేతులయందుఁ గొందఱును ఱాలపైఁ గొందఱును జిక్కంబులయందుఁ గొందఱును భుజియింపఁదొడంగిరి. మాటిమాటికిని వ్రేలుమడిచి యితరుల నూరించుచు నొకఁడూరుఁగాయలు దినుచుండును. ఒకనికంచంబులోనియన్నంబు నొడిసి యింకొకఁడు మ్రింగును. కృష్ణునిఁ జూడుమని యొకని నేమఱించి వానియన్నము నింకొకఁడు భక్షిం

చును. ఇవ్విధంబున నందఱును భుజియించుచుండిరి. అంతలోఁ గృష్ణుఁడటునిటుపరికించి చూచెను. గోవులుగానరావయ్యెను. అయ్యదియెఱింగి యాతఁడితరులంజూచి 'యోబాలకులారా! విచిత్రముగనున్నయది. ఇందు మేయుచుండిన గోవులుగానరావు. అవియెంతదవ్వరిగెనో తెలియరాకున్నది. ఇయ్యది ఘోరారణ్యము. ఇందుఁ గ్రూరజంతువులు విశేషంబుగఁ గలవు. మన గోవులకేయేజంతువులవలన నేయేబాధలుగలిగెనో తెలియరాకున్నది. మీరు భుజియింపుఁడు. నేను నిమిషంబున వానియిక్కువలరసివచ్చెద

'మ. వినుఁడో బాలకులార క్రేపులటవీవీథిన్ మహాదూరమున్
జనియెన్ గోమలఘాసఖాదనరతోత్సాహంబుతో నెందుఁబో
యెనో యేమయ్యెనో క్రూరజంతువులచే నేయాపదంబొందెనో
కని తెత్తుం గుడువుండు చల్దిగొనుఁడీ తల్లకాకుండ మీరందఱున్.'
న'ని చెప్పి యందుండి బయల్వెడలెను.

ఎంతదవ్వరిగినను నాతని కావులజాడ గానరాదయ్యె. అంత నతఁడు వానిగిట్టలజాడలఁ బట్టి 'యిచ్చోటఁ బచ్చిక మేసినవి. ఇచ్చోటనీరుద్రావినవి. ఇచ్చోట మందగొన్నవి. ఇచ్చోట వేఱువేఱైపోయిన

'క. ఇచ్చోఁ బచ్చిక మేసిన
విచ్చోఁ ద్రావినవి తోయమేగినవిచ్చో
నిచ్చోట మందఁగొన్నవి
యిచ్చోఁ బాసినవి జాడయి దెయదెయనుచున్.'
వ'నుకొనుచుఁ జనుచుండెను.

అవ్విధంబంతయు నెఱింగి బ్రహ్మ 'యీబాలుఁడు లోక కంటకుఁడగు నఘాసురునిఁ ద్రుంచెనని వింటిని. ఏవిధంబున వాని వధియించెనో? బాలురను క్రేపుల నెభ్భంగిఁ గాపాడెనో యెఱుఁగరాదు. బాలున కింత శక్తిగలిగెనను నంతకంటెఁ జోద్య మేమిగలదు? ఈతఁడు మాయకాఁడని తోఁచెడిని. ఈతని నెట్లైనను వంచింపవలెన'ని గోవులను బాలురను నొక్కెడ డాఁచెను. కృష్ణుఁడు పొదలయందును గొలంకుల కెలంకుల యందును వెదకి వెదకి యాలమందంగానక విసివి గోపాలురు చల్దిగుడుచు నెడకువచ్చెను. అయ్యెడ నెవ్వరును గానరారైరి. అంత నాతఁడు దివ్యజ్ఞానంబున నలువచెయ్దము నెఱింగి యిట్లని తలంచెను. 'నలువకు నన్ను వంచింపఁ బనిలేదు. నన్నుఁగను బ్రామి నావారలను డాఁచ నాతనితరమా? కానిమ్ము. ఈపనికై జంకనేల? మీబాలుగు నాయెఱుకలేక యెందరిగిరో యూహింపఁ జాలనంటినేని గోపికలు దల్లడిల్లుదురు. నన్నుఁ బలుగతుల దూఱుదురు. వీఁడు మిక్కిలి ప్రాణములు విడుతురు. తెలిసి చెప్పకున్నందున నాపాపము నన్నుఁ జుట్టుకొనును. అంతయేల? కన్నులు పూవు నంతకాటుక యేటికి? నన్ను సామాన్యునిగ నెంచి బ్రహ్మయింతగావించెను. నాశక్తి చూపుదుఁగాక' ఇట్లని తోఁడిబాలుర యాకారంబును గోవుల రూపంబులను దాల్చి ప్రొద్దుగ్రుంకుడు నింటికిఁ దరలెను.

సాయంకాలంబున గోవులందోలుకొని బాలకులిండ్లకు వచ్చిరని గోపకులు సంతసంబున నుండిరి. భగవంతుని చిత్రమెవ్వరికిని దెలియదయ్యెను. అదిమొదలొకవర్షముదనుకఁ గృష్ణుఁ

డారూపంబున మానక చరియించుచుండెను. అవ్విధంబెఱింగి బ్రహ్మ! 'యోహో! ముప్పువాటిల్లెనే? సర్వాంతర్యామిని విష్ణుమూర్తిని వంచింపఁదొరంకొనిన నాబుద్ధి పెడతలఁబట్టెను. ఇది నావలననగునే? ఏల యిట్టిదుర్భరకార్యంబునకుఁ గడంగితిని? వైళంబ చని యప్పరమేశ్వరు నాశ్రయించెద. ఆపద్బాంధవుఁడు నన్ను క్షమించిరక్షించు'నని రాయంచనెక్కి దేవదేవుఁడున్న యెడకరుదేరెను. అందుఁగృష్ణుండు సకలగోగోపబాలకసంఘంబులతోఁ గూడియుండెను. అదిచూచి వెఱఁగంది బ్రహ్మ రాయంచదిగ్గనడిగ్గి హరిడాయంజనియెను. గోవిందుండు నలువరాక నెఱింగియు నెఱుంగనివాఁడువలెఁ దనయాటలు పాటలు నెఱపుచుండెను. చతుర్ముఖుం డాతనిడాయంబోయి సాగిలఁబడి మ్రొక్కి లేచి కృతాంజలియై డగ్గుత్తికతో నిట్లని స్తుతియించెను. 'దేవదేవా! నీమహిమ నెఱుంగక నేనట్టి మాధ్యంబునొందితిని? నాతప్పు మన్నించి యేజన్మంబునందైన నీచరణసేవనొసంగి మన్నింపుము. నాకింతకంటె నేమివలయును.' నావుడు భగవంతుఁ డాతనిమన్నించి వీడుకొల్పెను. బ్రహ్మ రాజహంసంబునధిరోహించి సత్యలోకంబున కరిగి నిరతంబు నీశ్వరారాధనఁగావించుచుండెను.

మందయందు గోపాలురు కృష్ణుంగాంచిసంతసించి 'చెలికాఁడా వచ్చితివే? నిన్నుఁగాంచి యెంతకాలమాయెను? నీమాయ నెఱుంగ నెవ్వనివశమ'ని యనేకభంగులఁ బొగడఁజొచ్చిరి. కృష్ణుఁడు వారికిఁ దనకావించిన మాయఁ దెలియఁబఱచెను. సాయంకాలంబున నందఱు నిండ్లకరిగిరి.

# తొమ్మిదవప్రకరణము.

---

బలభద్రుఁ డొక్కనాఁడు మందతోడఁ బోవక యింటి యందుండెను. కృష్ణుఁడితరగోపబాలురఁగూడుకొని గోవులఁ దోలుకొని బయలుదేరెను. కొంతతడవునకు వారెల్లఁ గాళిందీతటంబుననిల్చిరి. పశువులు పచ్చికమేయఁజొచ్చెను. కొంతతడవున కవి దప్పిఁగొని యమ్మడుగునదిగి నీరుఁద్రావెను. గోపబాలురు గట్టుననుండిచూచుచుండ నవి యన్నియు నున్నటులుండి మెడలుద్రేలవేసి క్రిందఁబడి జీవములు విడిచెను. అది చూచి వారుగొల్లుననేడ్చిరి. శ్రీకృష్ణుఁడు వారియేడ్పులుడిపి యందఱంజూచి 'బాలులారా! యేలయేడ్చెదరు? ఇదికాళింది యను పేరుగన్నమడుగు. దీనియందు సర్పమొక్కటివసించుచుండును. దానినామము కాళియ. ఆకాళియాహియందునికిం జేసి దీనికిఁగాళిందీ తీర్థమని పేరు. దాని నోటినుండి విషవహ్నిశిఖలు వెలువడుచుండును. ఈమడుగుపైఁ బఱతెంచుపక్షులు నయితముదాని విషకీలలు సోకుటంజేసి యందుఁబడిమ్రగ్గును. ఆమడుగుపైనిగాలిసోకినయెడలఁ బ్రాణులెవ్వియైన నీల్గును. మీరుచూడుఁడు. ఆయుదకము పొంగుచున్నది. అదియెల్లప్పుడు నుడుకుచుండును. మీరు వెఱఁగందకుఁడు. నేనిందుదిగి యాసర్పంబును జంపి యీహ్రదంబును నిరపాయంబు గావింతును. పిమ్మటమన గోవులనుబ్రదికింతును. మీరిందుండి చూచుచుండుఁడ'ని పలికి సమీపంబుననున్న యొకకదంబభూజంబు నెక్కెను. అల్లెక్కి

యతఁడు నడుమునఁ జేలంబుగట్టిగ బంధించి వెండ్రుకలు చక్క
గముడిచి మడుగువైపునవ్యాపించిన యొకశాఖాగ్రంబునకుఁ
జని రెండుపాదంబులను గీలించి వక్షంబును వెంచి బాహువుల
నిరుప్రక్కలకుఁ జాచి హుమ్మనుచు మడుగునదూకెను. అప్పు
డుమడుగున జలంబు మఱింతపొంగెను. కృష్ణుఁడు బాహువుల
రెంటినిజాచి మహాభీమంబుగా నీదుచుండెను.

అట్టిసమయంబున నావిషాహి మనంబునఁ గ్రోధంబగ్గ
లంబగుడు మేనువెంచి దుస్సహవిషాగ్నిజ్వాలలం గ్రక్కుచు
'నీబాలుండెవ్వఁడు? నాబలంబెఱుంగక యిందుఱికినిర్లక్ష్యంబుగ
నీదుచున్నాఁడ'నుచునాతనింజుట్టి గట్టిగఁగఱచెను. కృష్ణుండు
చూపఱకుఁ బ్రాణంబులు గోల్పడినవానియట్లులు చేష్టలుదక్కి
యుండెను. అంతగోపాలకులు వెఱఁగంది 'యయ్యయో! యింకేమి
గలదు? ఈభుజంగము మనకృష్ణునింగఱచి యంతటఁబోక యా
తనిం జుట్టుకొనియె. ఈ యాపదనుండి మనల నింక రక్షించు
వారెవరు? ఎవ్వరినిశరణుఁజొత్తుము? ఎవ్వరి కడకరుగుదమని'
యూరక విలపింపఁజొచ్చిరి. కొందఱు మందకుఁబరువులిడి నంద
యశోదాదులకు నావృత్తాంతంబు వినిపించిరి. అంతవారు బెగ
డుగదిరినచిత్తంబుల నుత్తలపడుచు మహాఘోషంబున నాఘో
షంబు వెలువడిగోపబాలురుదారిఁజూపకాళిందీతటంబునకుఁ బరు
గుపరుగునవచ్చిరి. కృష్ణుని స్థితికరమసహ్యదాయకమైగనుపట్టెను.
అదిచూచివారు 'కృష్ణా! కృష్ణా'యని విలాపంబులుసేయుచుఁ
దాపంబులంబొందుచు 'నక్కటా! కాలముమనకింత ప్రతికూల
మయ్యెనే. హాతవిధీ! నీకుమేమే మెగ్గొనరించితిమ'ని దైవమును

దూఱుచుండిరి. కొందఱు యశోదంబట్టుకొని విలపించుచుఁ గృ
ష్ణు నుద్దేశించి యిట్లనిరి.

అయ్యో! కృష్ణా! నేఁడిదేమి విపరీతపుఁగాలము! అన్ని
దినంబును మాతల్లినీకెదురుగావచ్చిన నెదురవచ్చువాఁడవీనాఁ
డేలరాకున్నావు? నిన్నుఁగృపతోఁడఁజూచిననానందమునఁజూచు
నీవేల గనువిచ్చిచూడకున్నావు ? నాయనా! యని పిలిచిననో
యని పలుకువాఁడ వీనాఁడేల పలుకవు? నాఁడు రాక్షసివిష
కుచముల దుగ్ధంబుఁద్రావి విషవిజయుఁడవైన నీకీసర్పవిషమె
క్కెనే? అక్కటా! యీక్రూరభుజంగమలిగి నిన్నుఁగఱవఁగా
నెంతకంపించితివో! పాపఁపువిధి నెంతతిట్టితివో ! మమ్ముఁదలం
చి యెంతపలవించితివో! మమ్ముఁగఱవక యీపన్నగము నిన్నే
లకఱచెను? తండ్రీ! నీవొక్కఁడవున్నమమ్ములనందఱ రక్షింపఁ
గలవు. మేమిందఱముండియు నిన్నుఁగాపాడ నేరకున్నామే.
ఏల మాబ్రదుకులు? నీగోపాలక విహితులు నిన్నుఁ బిలుచు
చున్నారు. జాగుసేయక లేచిరమ్ము. అందెలుపాదములమ్రోయ
నాడుదువురమ్ము. మావీనులకువిందుగా భాషింతువురమ్ము. నీవు
మడుగుననున్న మాకిందుఁబ్రభువులెవ్వరు ? నీతోడమమ్ముఁ
గొనిపొమ్ము. మే మిందుండఁ జాలము. ఇట్లనుచుఁ దక్కఁగల
వారలఁ జేరి హ్రదంబును జొర నుద్యోగించిరి. బలభద్రుఁడు
కృష్ణునిమాయ నెఱింగినవాఁడుగావున వారినందఱివారించెను.

ఒక్కముహూర్తమాత్రమట్లు నిశ్చేష్టుఁడై యుండి కృ
ష్ణుఁడు మేను పెంచెను. అప్పుడు భుజగుఁడావృత్తులంబాసి కఱచు
టలువిడిచి శ్రాంతుఁడై తలయెత్తి విషమునుగ్రక్కుచుఁ జింత

చేనలుదిక్కులుసూచుచు ధూమకాష్ఠమువలెఁ దొలఁగి నిల్చె ను. అంతఁ గృష్ణుఁడు కాళియుని నొక్కచేతఁ జఱచి వైన తేయునియట్లు దాడలువట్టిచీల్చి జిఱజిఱఁద్రిప్పిక్రిందఁబడవై చెను. విషాగ్ని దానికన్నుల జొబ్బిలుచుండెను. అటుపిమ్మట వాసుదేవుండు కాళియునిఫణిఫణామంటపమున నృత్యమాడఁ జొచ్చెను. ఆనృత్యమునకు యమునాతరంగఘోషను మృదం గఘోషమయ్యెను. బృందావనంబునందుఁ జరించు చంచరీక ములగానము గాయకులగానంబై నెగడెను. కలహంసముల మంజుశబ్దములు తాళశబ్దములై చెలంగెను. త్రివిష్టపమునుండి వీక్షించుబృందారకాదిజనులు సభాసీనజనులై వెలింగిరి. అట్లు నృత్యంబుసలుపుచు నాతఁడానందించుచుండెను. ఫణీంద్రుఁడు కంఠగతప్రాణుండై దిక్కులుసూచుచుండెను. పిల్లికిఁ జెలగా టము. ఎలుకకుఁ బ్రాణసంకటము.

కృష్ణపదప్రహారంబులఁ బడగలెడసి నొచ్చి చచ్చిన యట్లుపడియున్న భర్తంజూచి నాగాంగనలు మిగులఁ బలవించి లోకైకశరణ్యునికినామహాత్మునికి దండప్రణామంబులాచరించి యనేకవిధంబులస్తుతియించి యిట్లనిపలికిరి. 'దేవా' భోగ మాకులమయ్యెను. ఔదలలన్నియుఁ బ్రవస్సెను. ప్రాణములు వచ్చుచుఁబోవుచున్నవి. ఇఁకమాప్రాణనాయకుని నీకరుణాదృ ష్టులఁజూచి విడిచిపెట్టుము. మాకుఁబెండ్లి సేయుము. మాజీవి తేశ్వరు ప్రాణములనిచ్చికావుము. చిన్నతనంబునందలి పెండ్లి పెండ్లిగాదు. నీవుసేయుపెండ్లియ పెండ్లి.

## తొమ్మిదవ ప్రకరణము.




'ఆ. మమ్ముఁబెండ్లి సేయు మా ప్రాణవల్లభు
ప్రాణమిచ్చికావు భక్తవరద
నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాఁటిపెండ్లి పెండ్లిగాదు.'

ఇట్లు వేడుకొను భుజఁగసతులయందుఁ గరుణించి పుండరీకాక్షుండు చరణఘట్టనంబుసాలించెను. ఫణీంద్రుఁ డట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మరలఁ బడసి చదిసి నులిసినతలలు సవరించుకొని వగరుచుచు నంజలిఘటియించి యంబుజాక్షునకిట్లనిపలికెను. 'మహాత్మా! నాపుణ్యమేమని చెప్పుదును? సనకాదిమునిచంద్రులకు సైతమలభ్యంబగు నీపాదరజంబును గంటిని. పుణ్యవంతుండనైతిని'. అనవుడు కృష్ణుం డతనింగాంచి యోయి ఫణీంద్రా! యీమడుగున గోవులును మనుజులును నీరు ద్రావుదురు. నీవిందుండఁదగదు. నీకుటుంబమును బిలుచుకొని యంబుధికి వైళంబచనుము. నీఫణములయందు నాపదలాంఛనంబులుండుటం జేసి యిదిమొదలు పక్షిరాజు నిన్నుఁ బట్టఁడని పలికెను. నాగేంద్రుండు భగవద్వాక్యంబుల కలరి కుటుంబసహితంబుగ నప్పుడ యామడుగువిడిచి కడలింజేరెను. ఆనాఁడు మొద లామడుగున నెల్లవారునుడిగి యాజలమును వాడుకొనఁ జొచ్చిరి. విషమునుబాసి జలము మధురమయ్యెను.

అంతఁ గృష్ణుండు మడుగువెడలివచ్చెను. యశోదయాతనిఁ గౌఁగిలించుకొని ముద్దాడెను. నందుండు మహానందము నొందెను. బలభద్రుండు సంతసించెను. గోపగోపికాజనంబు లుల్లాసంబులం జెలంగిరి. వృషభములులేచి యంకెలువైవఁ

దొడంగెను. గోవులంభాయని యఱవఁజొచ్చెను. లేఁగలట్టిట్టు ఉఱుచుండెను. వృక్షములన్నియుఁ జిగిర్చెను. గోపకులెల్లరు యశోదను మిగులభాగ్యవతిగనెంచి పొగడిరి.

ఇట్లువారారాత్రి యాకాళిందీతటంబుననివసించి యాఁకలిడప్పులడస్సి క్రుస్సియుండిరి. ఇంతలో నయ్యరణ్యంబున నొక్క దవానలంబుపుట్టి చుట్టుముట్టుకొనియెను. అదిజూచిగోపాలకు లదరిపడి'కృష్ణా!యల్ల దెచూడుము. కార్చిచ్చు పైకొనివచ్చుచున్నది. మేమెల్లరము నీపదపద్మంబులు నమ్మినాము. మమ్మేలాగున రక్షింతువోనీభారము. వేవేగనాదావాగ్ని వారింపుము'ని యెంతయువేడుకొనిరి. భగవంతుండు వారిఁబలుకకుండుఁడని గహనంబు నిండిన దావదహనంబును బానంబుసేసెను. అందఱు నాతని ననేకవిధంబులఁ గీర్తించిరి. ఆరాత్రి యెట్లోగడపి గోపకులు ప్రాతఃకాలమున మందకుఁజనిరి.

## పదియవప్రకరణము.

నందాదు లొకనాఁడింద్రయాగంబు సేయందలంచిరి. కృష్ణుఁడు వారిం జూచి యిట్లనియె 'మీరు యాగముసేయఁబూనితిరి. మంచిది. దీనిఫలమేమి? దీనికీశ్వరుఁడెవ్వఁడు? దీనికి వలయుసాధనములెవ్వి? ఇయ్యదిశాస్త్రీయమా? అట్లుగాక జనాచారమా? దీనిని వైరులకెఱింగింపరాదు గాని మిత్రులకెఱిఁగింపనగును. ఎఱిఁగిచేసిన యెడలఁ గోర్కెలెల్లఁగలుగును. కావున యన్నియు నెఱింగిన మీరలు దీనివిషయంబును సాంతం

బుగా నాకెఱింగింపుఁడు' అనవుడు నందుఁడు నందనుంజూచి యిట్లనిపలికెను. 'పుత్రా! నీకోరినవిషయ మెఱింగినంత వచింతును. అమరేంద్రుఁ డధికుఁడు. మేఘబృందము లతనికిఁ బ్రియమూర్తులు. దానంజేసి భూమిపై వర్ష మమరేంద్రుని పంపునఁ గురియును. భూతములు హర్షించును. వర్షజలములచే సస్యములు పండును. లోకులా పంటచే జీవింతురు. ఇంత యెఱిఁగి రాజులెల్లరు మేఘనాథుఁ డింద్రుఁడు మెచ్చుకొఱకు నింద్రయాగముసేయుదురు. దీని నెవ్వరు సేయకుందురు వారి కశుభంబు వాటిల్లును. అదియునుంగాక వర్షముగుసిరినఁ గసవు పెరుగును. కసవు మేసి యావులు వృద్ధిఁబొందును. ఆవులు వృద్ధిఁబొందిన వలసినంతపాడిగలుగును. పాడిగలిగిన మనుజులందఱుఁ దృప్తివహింతురు.'

అన విని కృష్ణుఁడు దనకామఖమున నిష్టములేమిఁ దండ్రింజూచి 'తండ్రీ! యిదియెక్కడిమాట. జంతువులోకమ్మున గర్మవశమునఁ బుట్టును. కర్మము చేతనే వృద్ధిఁబొందును. కర్మముచేతనేచెడును. జనులకుఁగర్మమే దేవత. సుఖదుఃఖములకును గర్మమే కారణము. సర్వము కర్మాధీనమై యునికింజేసి భూతంబులకుఁ బురుహూతునివలన భీతియేటికి? ఉత్పత్తిస్థితిలయకారణంబులు. సత్త్వరజస్తమోగుణంబులు. అందు రజంబున జగంబుజన్మించు. రజోగుణప్రేరితంబులై మేఘంబులు వర్షించు. వర్షంబునఁ బ్రజావృద్ధియగు. ఇంద్రుఁ డేమిచేయంగలవాఁడు? అతనికేలక్రతువుసేయవలయును? కాఁబట్టియతఁడు మనపైఁగోపింపవలసిన యవసరమింతయుఁజూపట్టదు. ఒకవేళ

నతఁడు గోపించినను మనకు నష్టమేమియు లేదు. మనపట్టణ ములును గేహములును వ్యాపారంబులును బోయినఁ బోవనిండు. హాయిగా శైలారణ్యభాగంబులం దుందము. ఇంతియకాదు. దీనికంటె నాకొక్కటి చాలమంచిదని తోఁచుచున్నది. అదిధర్మంబని మీరుఁదోఁచిన నది చేయుదుము. ఇంద్రయాగంబునకే వేవితెప్పింపనెంచితి రవియెల్లఁ దెప్పింపుఁడు. వంటలు సేయింపుఁడు. పిండివంటలుగావింపుఁడు. పప్పును వండింపుఁడు. సర్వమును సిద్ధము సేయింపుఁడు. హోమము సేయుఁడు. విప్రులకు ధేనుదక్షిణలిండు. పర్వతమునకుఁ బూజలొనరింపుఁడు. చండాలులకును శునకములకును దగినభక్ష్యములఁ గొనిరండు. పసులకుఁ గసవులు పెట్టుఁడు. ఇవన్నియు నొనరించి మనమెల్ల బంధుసమేతముగ నిష్టాన్నంబుల భుజియింతము. మేనుల గంధములనలందుదము. వలయునలంకారములఁ గావించుకొందము. చీనిచీనాంబరంబుల ధరించుకొందము. ఇవి యొనరించితిమేని మన జన్మము ధన్యంబగును. నాయభిమతంబు సైతమిట్లొనర్చుటయే. చెప్పవలసినది చెప్పితిని. పిమ్మట మీయిష్టమ'ని యూరకుండెను. అందులకు నందాదులెల్ల సంతసించిరి. గోపికలెల్ల వలయు పదార్థంబులు సిద్ధములుగావించిరి. కృష్ణుఁడొకశైలాకృతిందాల్చెను. గోపకులా శైలంబునుబూజించిరి. కృష్ణుని మాయ లెఱుంగమింజేసి వారలు శైలము నైవేద్యంబులం దినెనని సంతసించిరి. పిమ్మటనందఱుంగలిసి భుజియించిరి. భోజనానంతరమ్మున గోపకులెల్ల రాకొండకుఁ బ్రదక్షిణంబు సేసిరి. అట్లంతయు నొనర్చి మహానందంబునొంది యందఱుంగదలి మందకుఁజనిరి

నందాదులు దనకుమఖముఁ జేయమి కింద్రుఁడు కోపించి సకలమేఘంబులఁజీరి యిట్లనియె. వింటిరే నేఁడొక చోద్యము. ఈగోపాలురెల్లఁ గృష్ణునిమాటఁ బాటించి నన్నొకచీరికింగొనక పూజింపక యొకకొండనుబూజించి తమదారింజనిరి. వీరలకుఁ గ్రొవ్వుపట్టియున్నది. వీరు ద్రావిన పెరుగులను గ్రక్కింపవలయు. వీరుదిన్న భక్ష్యంబులను బయటికిరప్పింపవలయు. పిల్లవానిపలుకులు లెక్కసేసి నన్ను విడిచినవీరి నేమిచేసినను బాపములేదు. తత్క్షణము మీరిందుండి బయల్వెడలి మీమీతటిల్లతలఁగప్పి గర్జనములు సెలంగఁ జేసి గోవులను గోపాలురను వేధింపుఁడు. నేనుసైతము మీవెంట నేవత్తును. మీరలుగురియు ఱాలవర్షంబునంగాని వీరలు ప్రాణములువాయరు. అనవిని మేఘములు మహామోదమునొంది యందుండి బయలుదేరెను. నిమిషమాత్రంబున నాకాశమెల్ల మేఘాచ్ఛాదితమయ్యెను. రోదోంతరాళంబు నీరంధ్రఘనిబిడాంధకార బంధురంబుగ నిరోధింపఁబడెను. కన్నులు మిఱుమిట్లుగొల్పుచుఁ దటిల్లత లెల్లెడలఁ దళుకుతళుక్కున మెఱయుచుండెను. వర్షపుఁ జినుకులు చిటపటమని భూమిపయింబడఁదొడఁగెను. ఇంచుకసేపులోన బ్రహ్మాండభాండంబులు సిల్లులువడునట్లు లేనుఁగుతుండంబులంత ధారలతోడ వర్షమత్యధికమయ్యెను. మిట్టపల్లంబులు సమతలంబులై యేకార్ణవంబురూపంబునఁ జూపట్టుచుండెను. నడుమనడుమ మేఘమ్ములుశిలలవర్షించుచుఁ బిడుగులఱువ్వచుండెను. గోవృషభంబులు శిలాపాతంబులకు వెఱచి జలంబులనతిప్రయత్నంబున నీదుచుండెను. లేఁగలు మేఘఘోషణములకు భ్రమఁజెంది సొమ్మసిల్లిపడుచుండెను. గోపగోపికాజనంబు

లపాయంబుగలుగునని భీతిల్లి కృష్ణునిఁజేరి యిట్లని మొఱలిడఁ దొడఁగిరి. దేవా! నీవెక్కడనున్నాఁడవు? మరణంబునొంద సిద్ధమైయున్న మమ్ముఁగావవేమి? మేమెల్ల నీదాసులముగామా? ఈయుఱుములు విపరీతములుగవినఁబడుచున్నయవి. ఈమెఱుములుగన్నులను దెఱవనీయవు. ఇట్టివర్షమును మేమెన్నఁడెఱుఁగము. నిన్నుఁదక్క మేమితరమెఱుఁగము. ఇట్లుమమ్ముపేక్షించుటనీకున్యాయముగాదు. రమ్ము. కావుము. కావుము.'

అనవిని కృష్ణుఁడు గోపకులభీతిమాన్పఁదలంచి వలకేల నాతపత్రంబులీల గోవర్ధన పర్వతమునెత్తి యెల్లరను దానిక్రిందికి రమ్మనిపిలిచెను. కొందఱుదానిక్రిందికిఁ జనిరి. కొందఱదితల పైఁబడునను భీతిచేఁ దల్లడిల్లుచుండిరి. కృష్ణుఁడు వారలం గాంచి 'బంధుజనులారా! యేలమీకు సందేహము? ఈతఁడు బాలుఁడు. కొండగొప్పది. దీనిభారము నీతఁడు సైరింపఁజాలఁడు. మాగతియేమగునో యని మీరు శంకింపఁబనిలేదు. మహీచక్రమంతయు విఱిగిపైఁబడ్డను నాకేలల్లాడదు. మీరెల్లరుదీని

'శా. బాలుండీతఁడుగొండదొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ
జాలండోయని దీనిక్రిందనిలువన్ శంకింపఁగాబోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదుబంధులార! నిలుఁడీ! క్రిందన్ ప్రమోదంబునన్.'

క్రిందనిలువుఁడ'ని యుత్సాహవాక్కులుపలికెను. ఆతనిపలుకులచేననుమానములుమాని గోపజనమ్ములు పర్వతముక్రిందఁజేరిరి. ఇంద్రునకు మఱింతరోషము హెచ్చెను. ఆతఁడు మేఘములను

బురికొల్పఁజొచ్చెను. ఏడహోరాత్రములు వర్షము విడువక కురిసెను. కొండక్రిందివారికింతయైన నపాయము గలుగదయ్యె. బిడౌజుఁడు విఫలమనోరథుఁడై మేఘములమరలించుకొని తన దారింజనియెను. వానగాలి మెల్లనణఁగెను. గోపజనమ్ములు గొండక్రిందనుండి వెలుపలికరిగిరి. కృష్ణుఁడు గిరిని యథాస్థానంబుననిలిపెను. సకలజనులాతని కీర్తినభినందింపఁ దొడంగిరి.

'సీ. కన్నులు దెఱవని కడుఁజిన్నిపాపఁడై
దానవిచనుఁబాలు ద్రాగిచంపె
మూఁడవనెలనాఁడు ముద్దులబాలుఁడై
కోపించిశకటంబుఁ గూలఁదన్నె
నేడాదికుఱ్ఱఁడై యెగసితృణావర్తు
మెడఁబట్టుకొసి కూల్చి మృతునిఁ జేసెఁ
దల్లివెన్నలకునై తనుఱోలఁగట్టినఁ
గొమరుఁడై మద్దులు గూలనీడ్చెఁ
తే. బసులఁ గ్రేపులఁగాచుచు బకునిఁజీరె
వెలఁగతోవత్సదైత్యుని వ్రేసిగెడపె
సబలుఁడై ఖరదైత్యుని సంహరించె
నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ॥'

అంతఁ బురందరుఁ డాతని చెంతకువచ్చి కరకమలములు ముకుళించి తనయపరాధమును క్షమింపుమని వేడుకొనెను. సంశ్రితావనుఁడగు కృష్ణుండాతనిమన్నించి వీడుకొలిపెను. తుంబురునారదాదులు భగవంతునిఁగీర్తించిరి.

## పదునొకొండవ ప్రకరణము.

నందనందనుని చెయ్దంబులననుదినంబును జారులుకం
మున కెఱింగించుచుండిరి. అవివిన్నియు విని యాతఁడు భయంబున
నూరక చింతిల్లఁ దొడఁగెను. కన్నులుమూసిన నాతనికిఁ గృష్ణుఁ
డెదుటఁ గానఁ బడుచుండెను. ఒక్క రాత్రినైన నాతఁడు
సుఖముగ నిద్రింపఁ జాలఁడయ్యెను. నిరంతర స్వప్నములచే
నాతని మనము గలఁతనొందు చుండెను. ఆనాఁటికానాఁటి
కాతనికి వ్యధమనమునధికముగాఁ దొడఁగెను. ఇట్లుండ నొక
నాఁడు నిశీథమున నాతఁడు సభామంటపంబున నొక్కరుండు
గూర్చుండి యెద్దియో చింతించుచుండెను. చాణూరుఁడొకఁడు ప్ర
క్కన నిలువఁబడియుండెను. కొంతసేపునకుఁ గంసుఁడా చాణూరుం
జూచి యుగ్రసేనాదులఁ దక్షణము తనకడకుం గొనిరమ్మని యా
జ్ఞాపించెను. యదుభోజముఖ్యులెల్లరుఁ జారునివెంటఁ గొలువు
నకువచ్చిరి. కంసుఁడువారల కుచితాసంబులర్పించి కూర్చుండ
నియోగించెను. ఎల్లరుఁ గూర్చుండి తనుకేమి కీడుమూడునో
యని యోచించుచుండిరి. కంసుఁడు వారలఁగాంచి యిట్లని
పలుకఁ దొడఁగెను. 'యదుభోజముఖ్యులారా ! మీరెల్లరు
సర్వకార్యజ్ఞులరు. సర్వాగమములఁ బారఁగులరు. త్రివర్గవర్తన
నిపుణులరు. లోకవిక్రమ వివేక నిష్ఠులరు. సమర్థోపాయులరు.
అభిగుప్తమంత్రులరు. అనర్థములయందుఁ బరాఙ్ముఖులరు. ఆర్య
భావానుగతులరు. ఆర్త్రత్రాణతత్పరులరు. నయసమగ్రులరు.

బుద్ధిమగఁటిమి మీకు దేవతలు సైతముసాటిరారఁట. నరులవిష
యముఁగూర్చి చెప్పనేల? మీచరితములు పరమభద్రములు.
యదుభోజకులంబుల భరించి పేరుగన్న మీరు నాకెపుడు
హితవుఁదలఁచి నామనోవృత్తిననుసరించుచుందురు. ఇపుడునా
కొకయనర్థము జనించియున్నది. దాని నుపేక్షించుటమీకుఁ
బాడియగునే. అదియెద్దియనినవినుండు? కృష్ణుండు నాకపకారం
బు సేయఁబుట్టినవాఁడు. ఉపేక్షితమగురోగ మెట్టులట్టులాదురా
త్ముండు వర్ధిల్లుచున్నవాఁడు. ఎంత నేర్పునఁ జింతించినను వాని
పుట్టువుంబాడవు నున్నరూపునిశ్చయింపరాకున్నది. వానిచరి
తంబు లతిదైవతంబులునమానుషంబులుగఁ జూపట్టుచున్నవి.
అట్లగుటంజేసి యాతఁడాశ్చర్యకారణంబునఁ బుట్టిన దేవతాప
త్యంబని నేను తలంతును. అట్లుగానినాఁడెవ్వఁ డసురులతోడఁ
బూతనచను బాలుద్రావెననియోచింపనగు? ఎవ్వఁడు మద్దుల
నాశ్చర్యకరంబుగఁ గూలఁదన్న సమర్థుఁడు? ఎవ్వఁడు కాళియ
నాగంబునడఁచి యుండఁగలఁడు ? ఎవ్వఁడు గోవర్ధనపర్వత
మువలకేల బంతిలీలఁబట్టు నంతటి బలాఢ్యుఁడు ? ఇతరులకి
విసాధ్యంబులు గావు. మాయలయం దాఱితేఱిన నాబంటు
లింత కనేకులు ముగిసిరి. ఇఁక శేషించినవాఁ డొక్క కేశి
యనువాఁడే. వాఁడును బోయి కృష్ణుని చేఁగూలును. ఇఁక
వాని తరువాతివాఁడను నేను. చంపమఱఁగినవాఁడు నన్నే
లసైచును? అతఁడెట్లైనవచ్చి నాపైనుఱుకును. అదితప్పదు.
అంతయేల? అప్పుడప్పుడాతఁడు యమునివలె బొమలుముడిచి
పిడికిలినమరిచి యవుడుఁ గఱచుచుఁ గోపంబున నాపైఁబడుట
నామొగమున | వేలుచుందును. అక్కటా! యీతఁడేగదా

తొల్లి నరసింహుఁడై పుట్టి హిరణ్యకశిపు వధియించెనని విను చుందుము. కూర్మావతారమున మందరపర్వతముఁదాల్చినవాఁ డీతనికంటె మఱియెవ్వఁడు గలఁడు? హిరణ్యాక్షుని వరాహ రూపంబునఁ బేరులేకదోరించిన యాతఁ డితఁ డనివేఱుగ వక్కా ణింపవలయునా? వైరోచనువంచించి స్వర్గరాజ్యము జంభారి కిప్పించిన మేటియితఁడనియే నానిశ్చయము. ఒక్కటియేల? యుగయుగమున నితఁడుపుట్టి దుర్మార్గుల శిక్షించుచు సన్మార్గు లరక్షించుచు భూదేవికి మేలొనరించు చున్నాఁడు. మమ్ముల సంహరింపనీభవంబుఁ గొన్నట్లు తోఁచుచున్నది. నారదు వాక్యములఁబట్టి చూచిన నియ్యదివట్టితోఁచుటయేగాదు. నిశ్చ యము. ముమ్మాటికి నిశ్చయము.

ఇదియెల్ల నెఱిఁగి యెఱిఁగి నేనేల ప్రాణంబులు గోలుపోవ లయు? కృష్ణునభివృద్ధినొందనీయక త్రుంచివైచిన సంతయుఁ దీరును. వానియభివృద్ధికిఁ గారణభూతుఁడు వసుదేవుఁడే. ఈతడు పుట్టిన బిడ్డనర్ధరాత్రంబునఁ గొని నందునిమందకుఁజనియెనఁట. అందుండి యశోద పుత్రికను గొనివచ్చెనఁట. అదియంబరంబు నుండి నామరణముఁజెప్పిచనియెను. ఔరా! నమ్మినవానిగొం తుఁగోయుట యెంతపాతకము? ఈవసుదేవుని నమ్మితిని. మన్న నలనేకములుగావించి మనిచితిని. నాకంటె నెక్కుడుగఁజూచి తిని. పూజించితిని. ఈతఁడింతటిద్రోహమ్మునకొడిగట్టునని కలనై ననెంచియుండను. అట్టినితడింతఁదనుక భూమిపై నిలిచియుండ గలఁడే' అనవినియెవ్వరు నేదియుఁ బలుకనోడిమిన్నకుండిరి. కం సుండుక్రోధముఁ బట్టఁజాలక వసుదేవుని దిక్కు మొగంబై పలి కెను. 'వసుదేవా! యెట్టి కుటిలమానసుఁడవు! నీవుతడిగుడ్డలగొం

తులుగోయు చందములెప్పుడు నేర్చితివి? నమ్మించిగొంతుగోత పాపమని యెఱుఁగవా? భ్రూణహత్యాది పాపములకైన నవధి గలదుగాని కృతఘ్నునికలుషమునకు నవధిలేదను పలుకులు వినవే. దానికి ఫలము నరకలోకవాసము.

'తే.గీ. భ్రూణహత్యాదులగు పాపములకు నవధి
గలదుగాని కృతఘ్నుని కలుషమునకు
లేదు నిష్కృతియంతంబు లేనితీవ్ర
నరకపీడ సంప్రాప్యమన్నరునకంద్రు॥'

అది యట్లుండనిమ్ము. నేను కులమున కొక్కకొఱఁతయు లేక రక్షించుచున్నాఁడ. అట్టినాయెడ నీవిట్టిద్రోహంబుఁగావిం చుటపాడిగాదు. నీకు నేండ్లువచ్చినవి. నీవును ముదిసితివి. ఏమి ప్రయోజనము? నీకౌటిల్యము నేనెఱుంగనై తినసితలఁపకుము. నన్నుఁజంపించి నీకొడుకును రాజుఁగావించిమధుర నేలింపఁజూచె దవు. కానిమ్ము. నన్ను సామాన్యునిగ నెంచి నీవిట్టి యోచన గొనరించితివిగదా! నాకేశ్వరుఁడై ననన్నెదిరింపఁజాలఁడనువిష యమును మఱచితివిగాఁబోలు. పినాకధరుఁడు నాకు సాటిరాఁ డనుట నీవెఱింగినదేకదా! ఇఁక బాలుఁడెట్లు నాతోడ డీకొను నని యెంచితివి? ఇది నీతప్పుగాదు. నిన్నుఁబట్టి వేధించుచున్న యాశాపిశాచము నిన్నిట్లు పురికొల్పుచున్నది.

పామునకుఁ బాలోసి పెంచినట్లు దుర్మార్గునకు నీకునాతం డ్రి యెంత మేలొనరించెను? అది నీకింతయైనను దలఁపునకు వచ్చెనే? ఆదినుండియు నీకృత్యముల నీచత్వము గానరాదు. ఇప్పుడేలొకో యిట్టివానికిఁ బూనుకొంటివి. చేసినవానిఁ జేసితివి.

ఇంకను జేయుము. నీవెట్టి పనులొనర్చినను నిన్ను నేను చంపను. నా చేతులాడవు. పుట్టించినవాఁడు మొగమున వ్రాసినట్లగునని పూర్ణముగ నమ్మియుందును. నీదౌరాత్మ్యము యదుకులము వారికిఁ దలవంపుఁ గలుగఁ జేసెను. మానహీనునకు నీకు కులము వారి జోలియొకటి వలయునే? కృష్ణునకును నాకును గలిగిన వైరమూరకపోవదు. మాయిరువురియందొక్కరుఁడు శాంతించుటనిక్కువము. నిన్ను నేను వెడలనడువఁ జాల. నీకిష్టమున్న నిందుండుము. లేకున్న నెందేనిం జనుము. పలుకులఁబనిలేదు.' అన విని వసుదేవుఁ డెద్దియుఁ బలుకఁజాలక సర్వాత్ముని నమ్మి యూరకుండెను. కంసుఁడాతని ననినఁ గార్యంబులేదని యెంచి భోజకులాలంకారు నక్రూరుం బిలిచెను. అక్రూరుఁడు లేచి మెల్లనఁ గంసుడాయం జనియెను. కంసుఁ డాతనిం గాంచి యిట్లని పలికెను. 'అనఘా! నీయందు నాకు నమ్మకము గలదు. నీవు నాకొక్కకార్యముఁ గావింపవలయు. వసుదేవునికి అపు లెవ్వియు వినకుము. ఈ ప్రొద్దకె గలి గోకులంబునకుఁ జనుము. అందు నందగోపకునిఁ గాంచి నామాటగా 'నీవు నీవారలను గలిసి యియ్యేటి యరిఁ గొనిరమ్ము. తడవు సేయం జనదు. అంతియకాక యేను నాధనువున కుత్సవంబు సేసెదను. దీనికి ననేక దేశాధీశ్వరులు రాజులు సకలజనులు వచ్చుచున్నారు. ఎల్లర కనేక దివసంబులదనుక భోజనంపువసతు లేర్పఱుపవలసియుందును. అందులకు వలయు దధిక్షీరఘృతంబుల నపరిమితంబులుగ గోపాలుర చేతంబంపుము. నామేనల్లురను బాలురను జూడ బుద్ధిపొడుముచున్నది. వారిని నీయక్రూరునితోడ నంపుమ'ని పలుకుము. ఎట్లైన నందునకుఁ దగుమాటలు సెప్పి బలరామకృష్ణులఁ దోడితెమ్ము. నాయొద్దనున్న జెట్టి మల్లులతో

వారిని జీకొనఁ జేసెదను. వారి శక్తులావలఁ దెలియనగును. నా పలుకులకడ్డమువలుకకుము. వేవేగఁజనుము'. అనవిని యక్రూరుం డమందానందకందళితహృదయారవిందుం డై గోవిందు దర్శనము సేయు భాగ్యము బ్బెనని లోలోన నువ్విళులూరుచు బయలు దేరెను.

## పంద్రెండవ ప్రకరణము.

అక్రూరుండు సనినవెనుకఁ గంసుఁడుకొలువుసాలించి వసుదేవాదుల నెప్పటియట్ల కారాగారంబునఁ ద్రోయించి తన కుముఖ్యునిఁ గేశియనురక్కసునిం బిలువనంపెను. వాఁడువచ్చి కంసునికి వందనమాచరించి యాజ్ఞ యేమని మెల్లననడిగెను. కంసుఁ డాతనిఁజూచి 'నీవు వేవేగఁజని నందునిమందయందుఁగల నా మేనల్లురవధించి యావార్త నా చెవిని వేయవలయు. వారి నిటకుఁ గొనిరమ్మనియిప్పుడ యక్రూరునంపితిని. ఆతఁడు రేపుదయమున బయలు దేరఁగలఁడు. మార్గమధ్యముననే రామకృష్ణులమరణవార్తనాతని చెవినివేసి నీవాతని మగుడఁగొనిరమ్ము. పొమ్ము'ని సాగనంపెను. మహాప్రసాదమని కేశి నందుని మంద కప్పుడ బయల్వెడలెను.

తెల్లవాఱెను. మందయందు మహాశ్వరూపమున సంచరించుచుఁ గేశి పేర ఘోరమ గోపకుల నుక్కడఁగింపనిష్టము లేనివాఁడై శ్రీకృష్ణు వెదకఁజొచ్చెను. ఆతని రాక నెఱింగి నారాయణుండు చిఱునవ్వునవ్వి గోపకులనెల్ల దూరముగండనియెను.

దానవుఁ డుగ్రసింహనాదంబుఁ గావించి నోరుదెఱచి గోవిందుని మ్రింగఁదొడఁగెను. కృష్ణుఁడు మెల్లన నాతని నోటఁబడక దూరమయ్యెను. కేశి మహాకోపంబు నొంది యాతనిఁ దన కాల నొక్క తన్ను దన్నెను. ఆతన్నునకు నోర్వక హరి రెండు చేతుల నిశాటుని పాదములం బట్టి ధనుశ్శతమాత్రదూరము విసరివైచెను. వాఁడు దూరమునుండి హుంకరించుచు లేచి పరువిడుచు వచ్చి కృష్ణునిం బట్టి నోటనుంచుకొని మ్రింగివైచెను. భగవంతుఁ డాతని కుక్షిలోనఁ జేరి దేహమ్మును బెంచెను. దానవుని కూపిరి యాడదయ్యెను. అంత నాతఁడు విలవిలఁ దన్నుకొనుచుఁ గ్రిందఁబడి చచ్చెను.

అయ్యది యెఱింగి మహాసంతోషంబున నరుదెంచి నారదుండు బాలకృష్ణునిఁ గీర్తించి తనదారిం జనియెను. అంత గోపాలకులు కొందఱు గొఱియలుగను కొందఱు పాలకులుగను కొందఱు దొంగలుగను నాడుకొనుచుండిరి. అది తెలిసి కంసునికి హితుండు మఱియొక దానవుండు వారిలో నొక గోపబాలుఁడై యాడుచుండెను. ఆతని యునికినిఁ గృష్ణుఁడు దక్క మఱెవ్వరెఱుఁగరు. గోపబాలుని రూపముననున్న దానవుఁడు దక్కిన గోపాలుర నెల్లఁ దోడ్కొని చని యొక గుహయందుఁ బ్రవేశింపఁజేసి దాని ద్వారమ్ము నొక పెనుఱాత మూసివైచెను. ఆవల నొక్కెడనున్న కృష్ణుఁ డయ్యది యెఱింగి దొంగ గోపబాలునిఁబట్టి 'యోరీ? నిశాట! నీదొంగతనము బయటపడియెను. నీవింకెక్కడికేగఁగలవు? చావుమ'నుచుఁ బిడికిటఁ బొడిచెను. వాఁడు విలవిలఁదన్నుకొనుచుఁ జచ్చెను.

అక్రూరుండు రథమెక్కి బయలుదేరెను. మార్గమధ్యమున నాతఁడు శ్రీకృష్ణునిఁ జూడఁగలిగినందులకు మనంబున నుప్పొంగుచు మధురాపుర మెప్పుడెప్పుడు వచ్చునో యనుకొనుచుండెను. మధురాపురము వచ్చెను. అక్రూరుఁ డందుఁ బ్రవేశించెను. ఆతనిరాక నెఱింగి నందాదులు పరమానందభరితులైరి. రామకృష్ణు లాతని నెదుర్కొనిరి. అక్రూరుఁడు వారల పాదంబులకు మ్రొక్కి పొగడఁజొచ్చెను. కొంత సేపునకు నందునిపంపునఁ గొందఱు వచ్చి యక్రూరునిఁ గొంపోయి భోజనమజ్జనాదులు గావించిరి. అక్రూరుండు గొంత విశ్రమించెను. అంతట రామకృష్ణు లాతని డాసిరి. కృష్ణుఁ డాతనిఁగాంచి యిట్లనియె.

అయ్యా! యక్రూర! మధురాపురంబున నేమివిశేషములు? నాతలిదండ్రులు సుఖమున్నవారా? చుట్టాలకు క్షేమమే కదా! మామామ భయములేక వర్తించుచున్నాఁడా? అతఁడు నాతలిదండ్రులను గారాగారమునుండి ముక్తులఁగావింపఁ దలపెట్టఁడని తలంతును. నీవు వచ్చుటవిని నాజననీ జనకులేమైననాతోఁడఁ జెప్పుమని చెప్పిరుగదా! వారిస్థితియెట్లున్నది? చెఱయందలి బాధలచేమిగుల డస్సిరిగాఁబోలు. సవిస్తరముగా నాకువిషయములెల్లఁ జెప్పుము'. అనవిని యక్రూరుండు కంసునిక్రౌర్యంబును దేవకీవసుదేవులబాధలను జెప్పియిట్లనియె. 'మహాత్మా! యేమిచెప్పుదును! నిన్నరాత్రి కంసుఁడు మీతండ్రినూరకేయనరాని మాటలనియెను. ఆతనియెదుట మిమ్ములను జంపించునట్లు ప్రతినపట్టెను. ధనుర్యాగంబు పేరుసెప్పి మిమ్ములఁ గొనిరానంపెను. నేనువచ్చితిని. మీయిష్టము' నావుడు కృష్ణుఁడా

నందమొందినందాదులంగాచి 'కంసనాయకుండు ధనుర్యాగంబుఁ జూడ మమ్ముఁబిలుచుకొని రా నీయక్రూరునంపినాఁడు. మేము వశ్యమాత్రినిఁ జూడఁబోవలయు. మఖమునకువలయు కట్నములు గానుకలుగొనిరండు. పాలు నెయ్యి పెరుగులు గూడఁబెట్టుఁడు. త్వరపడుఁడు'ని పలికెను. గోపకులు దమతమ గృహంబుల కేగిరి. రామకృష్ణుల మధురాపురప్రయాణంబులను విని పురంబునందలిజనంబు 'హాహా! యిదియేమివింత. బాలకుల యాటపాటలఁ గన్నులారఁ జూడక యెట్లు మనఁగలము? ఈయక్రూరుఁ డెక్కడ దాపురించెను? మనకు దినము లిఁక నెట్లు గడచునో యెఱుఁగరా దయ్యెను. అందఱము నేగి బాలకులఁ గొనిపోవవలదని యక్రూరుని బ్రార్థింతమా!'. యనుకొనుచుండిరి. ఇంతలోన గోపాలకృష్ణుండు బలభద్రుఁగూడుకొని యక్రూరుండు తోడరాఁ గాంచనరథంబు నారోహించి బయలుదేరెను. గోపికాగోపకసంఘము లాతనివెంటఁ దవిలిరి. కృష్ణుఁడు వారి నతిప్రయత్నమున వెనుకకు మరల్చి పోవుచుండెను.

రామకృష్ణులకు మార్గమధ్యమున నొక కొలంకు గానఁబడెను. వారలిరువురందుడిగి పానీయంబులుద్రావి మగుడరథమెక్కిరి. అక్రూరుండు వారలయనుజ్ఞచే నాకొలంకునడిగి స్నానమాచరించెను. అతని కానీరు మిగులఁ జల్లఁగనుండెను. భగవంతుని సంస్మరించుచు మనముఁ జంచలంబునొందనీయక దిటముగావించుకొని యక్రూరుండు నీటివైపు దృష్టిసారించి చూచుచుండెను. అతని కానీటిమధ్యమున రామకృష్ణులు గానఁబడిరి.

'వీరు రథముపైనున్నవా రిందుల కెట్లువచ్చిరి? రెండుదిక్కు లను వీరు దోఁచుట నాకు విభ్రాంతి నొసంగుచున్నది. ఇది విభ్రాంతియని నమ్మవలసిన దగునే? కాదు. కాదు. ఇది నిక్కువ మ'ని యాతఁడు ఱెప్పవాల్పక చూచుచుండెను. శేషాహిపైఁ బరుండియున్న నారాయణుఁ డాతనికి లోచన గోచరమయ్యెను. అక్రూరు నానందమునకు మేరయెక్కడిది? 'ఆహా! యేమి నాపుణ్యము! యోగిజనమ్ములకు సైతము సాధ్యముగాని పరమపూరుషుఁడు నాకన్నుల కగపడుచు న్నాఁడు. ఈమహాత్ముని ధ్యానించి కైవల్యము నందెద ననుచు' నాతఁడు రెండుచేతులు జోడించి నిష్ఠాపరుండై యనంతుని, నాదిమధ్యాంత రహితుని, స్వయంజ్యోతిని, నిరాకారుని, బ్రహ్మంబును, ధ్యానించుచు నిలువఁబడెను. కొంత సేపునకుఁ బరమాత్మ తనతోంటిరూపు సాలించెను. అక్రూరుఁడు నదీజలం బులు వెడలి వచ్చి వెఱఁగుఁగొన్నవాఁడై కృష్ణు డాయంబో యెను. కృష్ణుఁ డాతనింజీరి, 'యక్రూరా! యింతితడ వెందుం టివి? ఏమిచేయుచుంటివి? ఏవిధైయెనను నీకు వింతలు గానఁబ డెనా? య'ని యెద్దియు నెఱుఁగనటు లడిగెను. లీలామానుష విగ్రహుం డగుహరిపలుకుల నెఱింగి యక్రూరుండు సంతసించి యాతని స్తోత్రము గావించెను. ఇట్లు గావించి యాతఁడు రథమెక్కి హయములఁ బోవనిచ్చెను. ఇంచుక తడవునకు రథము మధురాపురంబును డాసెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.

---

పడమట బారెడుప్రొద్దుండెను. మధురాపురంబు చెంగటరథమునిలిపి యక్రూరుండు రామకృష్ణులఁ దనయింటికి రమ్మనివేవిధములఁ బ్రార్థించెను. రామకృష్ణులాతని నాదరించి కంసవధానంతరమున వచ్చెదమని పలికి వీడ్కొల్పిరి. అక్రూరుండు సంతసంబునఁ బురముఁ బ్రవేశించెను.

ఆతనిరాకఁజారులవలన నెఱింగి కంసుండు మేడపైఁ గూర్చుండి యాతనిఁ బిలువనంపెను. అక్రూరుండతని కడకు వచ్చిమ్రొక్కియుచితాసనమ్మున నుపవసించెను. కంసుఁడాతనిఁ గాంచి 'యక్రూరా! నీవుపోయినపని యేమయ్యెను? రామకృష్ణులు వచ్చిరా? ఏరివారు? ఎందున్నారు? ఇందులకేలరారైరి' యని యాతురతతోడఁ బలికెను. అక్రూరుండు 'రాంజేంద్రా! వారు వచ్చిరి. ఊరిబయట నున్నవారు. త్వరలోనఁ బురములోనికివత్తు' రని నుడివెను. కంసునకుఁ బట్టరాని సంతోషము గలిగెను అదియ సమయముగ నక్రూరుండాతని కడసెలవు గొనియింటికే గెను.

రామకృష్ణులు మధురానగరప్రవేశముఁగావించిరి. ఒప్పులొలుకు నప్పట్టణమునందలి రామణీయకముఁ జూచి వారచ్చెరువందుచుండిరి. కృష్ణుఁడన్నఁజూచి యిట్లనియె.

అన్నా! యీప్రాసాదము లెంతయెత్తున్నవో చూడుము. ఏమి యీదీర్ఘికల సొంపు! ఇంతలింతలు వెడల్పు వీధు

లెండైనఁ గలవే? ధాన్యపురాసు లెందుఁజూచినను గలవు. ఈ వీరు లెంతబలిసియున్నారు! ఆహా! యేమియీపురలక్ష్మిశోభ! ఎన్నాళ్లకీపురంబును గాంచఁగలిగితిమి! అన విని బలరాముఁడౌ నౌ! నని వింతగఁ జూచుచుండెను.

వారి రాక నెఱింగి పౌరులెల్లరు మూకలు గట్టి యొకరితోడ నొకరు గుసగుసలాడుచుండిరి. సుందరులు సౌధవీధుల నిలిచి వారినిఁజూచుచుండిరి. కొందఱు కృష్ణుంగాంచి వింతపడి యిట్లని పలుకఁ దొడఁగిరి.

సీ. ఏఁడఁటే రక్కసి విగతజీవఁగఁ జన్ను
బాలు ద్రావిన మేటి బాలకుండు
ఏఁడఁటే నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
ఏఁడఁటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాఁప కీఁడు
ఏఁడఁటే యెలయించి వ్రేతలమానంబు
సూఱలాడిన లోకసుందరుండు
తే. ఏఁడు లేకున్నఁ బురమటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలువృథలు.

కొందఱాతనిఁగాంచి 'యాహా! యేమేమి నోములు నోచి నందుని మందయందలి గోపికలితనిఁ జింతించుచుఁ బాడుచు నానందమొందుచుండిరని' ముక్కులపై వ్రేళ్లిడుకొను

చుండిరి. కొంద ఱింతకింటెఁ బుణ్యదివసముగలుగఁబో దని రామకృష్ణులపైఁ బువ్వులు సల్లుచుండిరి. అట్లు పురమెల్ల నానందరసాంబునిధినోలలాడుచుండ వారలు పురవీథులం గడచి చనుచుండిరి.

ఆసయమ్మున నామార్గమున నొక రజకుఁడు చనుచుండెను. వానిభుజమున నొక పెద్దమూట వ్రేలాడుచుండెను. ఆమూట నిండుగ విలువగల వసనంబులుండెను. కృష్ణుఁడు వాని జూసి 'యోరీ చాకలీ! యెవ్వరి కీవలువలు గొని చనుచున్నాఁడవు? ఈమూటయం దెట్టి బట్టలుగలవు మాకుఁజూపుము. ఇవి మాకైనఁజాల సొంపుగ నుండునట్లుతోఁచెడి న'నుచు చంకనున్న మూటను లాగెను. చాకలి గన్నులఁ గెంపుగదురఁ గృష్ణు నదలించి యిట్లనియె. 'ఏమేమీ? మారాజుచేలములు నీకుఁగావలయునే? వానినిఁగట్టనీకర్హతగలదే. మారాజేంద్రుఁ డెక్కడ? నీవెక్కడ? ఏనుఁగుతో దోమనుసాటిసేయవచ్చునే? ఎంతమాటాడితివి! ఈమాటా మాటాడితివేని నీకు బ్రదుకుగలదే. జాగరూకతఁ బొమ్ము. లేకున్న నీగతి పట్టిదగును'. అనవిని రోషించి కృష్ణుఁడాతని వెంద్రుకలువట్టియీడ్చి క్రిందఁ బడద్రొబ్బియొక్కపిడికిటి పోటున యమునిఁజేరఁబంపెను. తమవాని చావుఁజూచితక్కుంగలరజకులెల్ల రుభయకంపితులైరి. కొందఱు గోపాలుఁడు దమ్మెక్కడఁ జంపునోయని మూటలందుఁ బాఱవైచి కాలికి బుద్ధిసెప్పిరి. కొందఱామహాత్ముఁడు గోరినవలువల నిచ్చిత్రప్తిపఱచిరి. కొందఱు వడవడవడఁకుచు నేమియుఁదోఁపక నిలిచి యుండిరి. ధైర్యమవలంబించి యొక్కఁడు వచ్చి గోవిందునకు నమస్కరించి తనమూటఁ గలవస్త్రములన్నియు

నర్పించెను. స్వామి గొన్నిఁటి బలభద్రునకొసంగి తక్కినవి దానుధరించి మిగిలినవి యితరగోపకులకొసంగెను.

అవ్విధంబునఁ గృతకృత్యులై వారిరువురందుండి బయలుదేరి సుదాముఁడను నొక మాలాకారుగృహమున కేగిరి. సుదాముఁడు వారిఁజూచినంత నేలేచి యాసనమర్పించి గౌరవించి 'మహాత్ములారా! యేమినాపుణ్యము! నాకులమంతయుఁ బావనమయ్యెను. పూర్వజన్మకృత తపంబుపండెను. నావలన నెయ్యదియైనఁ గార్యములున్న నానతిండు. తత్క్షణమయొనర్చెద న'ని సవినయంబుగఁ బలికి సురభికుసుమదామముల ననేకములనుగొని వచ్చి వారిముందుంచెను. రామదామోదరులు వలసినన్నిసుమంబుల నలంకరించుకొని తోడివారలకొసఁగిరి. వారునుగావలసినన్ని ధరియించిరి. అంతఁ గృష్ణుఁడు సుదామునిదిక్కు మొగంబై 'యోయీ! నీభక్తికిమెచ్చితిమి. కోరినవరములడుగుము. ఇచ్చెదమని'పలికెను. మాలాకారుఁడు సంతసించి 'మహాత్మా! భవదనుగ్రహముదక్క నాకొండువరమేల? సర్వకాల సర్వావస్థలయందును నీభక్తినిమానకుండఁ జేయుము. సర్వ భూతముల యందు సమబుద్ధినొసంగు

'క. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపారభూతదయయును
దాపసమందార నాకుఁదయచేయఁగదే.'

మ'నిదీనుఁడై వేడుకొనెను. భగవంతుఁడాతని కోరికఁదీర్చియందుండిబయలుదేరెను.

కొంతదవ్వు చనునంతకు వారికొకవికృతపుశరీరముగల యొకయాఁడుది కానఁబడెను. ఆమె శరీరముమిగులఁ గుఱుచగ నుండి వెక్కువంకరల నొప్పుచుండెను. అట్టికురూపిఁజూచి కృష్ణుఁడు హాస్యంబుననట్లనియె. 'తరుణీ! నీవెవ్వతెవు? నీపే రేమి? ఈగంధము నెవ్వరికిఁ గొని చనుచున్నావు? మాకీలేపన మొసఁగుము. నీవు చక్కనగుదువు.' నావుడాయమ 'యయ్యా! నీవుచక్కనివాఁడవుగదా! నన్నేమి వెక్కిరింతువు? నీ వెగతా ళిచేసినను జేయకున్నను నాకెక్కడనుండి చక్కఁదనమువచ్చు ను? పుట్టినవారందఱును జక్కనివారైనఁ గురూపులెవ్వరుగ లుగుదురు? అందఱును బల్లకులెక్కినమోయువారుండవలదా! మీతో నాకేమి?నన్నుభగవంతుఁడిట్లుపుట్టించినాఁడు.నన్నుఁద్రివ క్రయనియిక్కడివారందురు. నేనుకంసదాసిని. ఆయనకుఁగీగం ధముఁ గొనిపోవుచున్నాను. వలయునేని మీరును దీనిఁబూసి కొనియానందింపుఁడ'నిగిన్నెవారలముందుంచెను. రామ కృష్ణు లువలసినంత గంధమునలందిరి. వారితోడనున్నవారును గావల సినంత గంధమునుబూసికొనిరి. కృష్ణుఁడంతనయ్యబలకుపకృతి సలుపువాఁడై యామె పాదంబులఁ దనపాదంబునుంచి దేహ మును బైకెత్తెను. కుబ్జవంకరదీరెను. ఆమెచక్కఁదనమున కెల్లవారును నద్భుతమందిరి.

రామకృష్ణులయ్యెడఁ గడచిచని విపణిమార్గంబులదాటి ధనుశ్శాలకరిగిరి. అయెడఁ గావలివారలు వారిని లోనికరుగనీ యక వారించిరి. రామకృష్ణులు వారిఁజేరికిఁ గొనక వెడలఁ దరిమి లోనికేగిరి. అందొకదుస్తరశరాసనముండెను. కృష్ణుఁడుదాని నెత్తిగంధేభము చెఱకుగడఁ ద్రుంచునట్లు లవలీలఁద్రుంచి

వైచెను. ఆశబ్దము వీనులకు భీషణంబయి రోదోంతరములు నిండెను. కంసుఁడారవంబునకులికిపడెను. కావలివారలరుదెంచి బాలురనిరువురఁబట్టిరి. బాలురులాఘవంబునవారి నెల్ల నిర్మూలముఁ గావించిరి. వారిధాటికాగఁజాలక నసిచెడితక్కిన వారలక్కడనుండి ప్రాణములుగాచుకొనుతలంపున నెందేనిఁ బరువులిడిరి. అంత రామకృష్ణులు విడిదలకుఁజనిరి.

## పదునాలవప్రకరణము.

అంతలో సాయంకాలమయ్యెను. ఆకాశమనునరణ్యమునఁ జరించు నంధకార గజమును బట్టనెంచి నుచ్చిడుటకుఁ గాఁగాలవ్యాధుఁడు చూతాంకురశ్రేణిచేతఁ గల్పించిన చెండో యను నట్లు పశ్చిమాద్రియందు మందప్రభతోడభానుండు చూపట్టెను. సాధ్వియగుకమలనారి తనపతిఁ దపనునిమానిన కతమ్మున దైన్యమువహించిన దోయను నట్లు ముకుళింపఁజొచ్చెను. క్రమముగఁ జీఁకటులు నలుదిశల వ్యాపింపఁదొడంగెను. తుమ్మెదలు మెల్లమెల్లన సరోరుహ కుట్మలంబుల వసింపఁబూనెను. ప్రాగ్గిశాలలనాలలామ ఫాలతలంబున కీర్తిఁగాంచుసిందూర తిలకమనఁబెంపొంది విరహిజనముల ధైర్యవల్లులఁద్రెంచుని మిత్తమ్మునద్వరకుఁడె త్తినదాత్రిమననొప్పుఁగాంచి, కాలకిరాతుఁడలిగిచీకటిమెకంబుద్రుంచుకారణమ్మున మెఱయించుఖడ్గమనదర్పమువహించియాకాశతమాలతరుప్రాక్శాఖయందు మెఱయుపల్లవమననింపుఁగాంచికలువలు సంతసంబు నొంద చోరులుడెంద

ములఁ గుండ సముద్రమాకసము ముట్ట నతిశయముఁ జెందఁజ
కోరకములానందమును బొందఁ జారులు భయంబునఁ గంద
శీతకరుఁ డుదయాచలంబునఁ జూపట్టెను.

రామకృష్ణులారేయి తమతోడి గోపడింభకులఁగూడి
వెన్నెలయందు క్షీరాన్నంబులుగుడుచుచునానాగాథలం జెప్పు
కొనుచు నానందమునొందు చుండిరి. కంసుఁ డనుచరులచేవారి
చేష్టలెఱింగి విహ్వలుండై నిద్దుర లేకచింతిల్లుచుండెను. అతఁడు
పాన్పునఁబవ్వళింప నెంచిన నెద్దియో యొకరూపముగానఁబడి
యాతని బెదరించుచున్నట్లుండెను. ఏమిచేయుటకును దోఁపక
యతఁడు శయ్యపైఁబరుండి యటునిటు పొరలఁ జొచ్చెను.
అతిప్రయత్నమున నాతనికెట్టెట్టులో గొంచెమునిద్దురపట్టెను.
ఆనిద్రయందాతఁడు కలవరించుచుండెను. మఱికొంత తడవున
కెవ్వరో తన్ను దన్నినయట్లు తోఁప నాతఁడులికి లేచి చెంతనున్న
భార్యలఁజూచి వికారముగఁ బలవించెను. వారాతనిడగ్గఱ
కన్నులు దుడిచియాశ్వాసించిరి. అతనికొడలు దెలిసెను. అది
యెఱిఁగియాతని కాంతలిట్లనిరి. 'నాథా! యిదియేమియాగ
డము? ఏలయిట్లున్నారు, అనవిని యతఁడువారలఁజూచి 'కాం
తలారా! యేమిచెప్పుదును! నాకెద్దియో భ్రాంతిజనించినట్లున్నది.
నిద్రపట్టకపట్టకయింతకుముందుఁ గొంచెముపట్టెను. అంతలో
స్వప్నములు బయలుదేరెను. తలఁచుకొనినగుండెలు జల్లుమను
చున్నవి. ఒడలుగంపమెత్తుచున్నది. కలలో గరళముఁదింటిని.
ప్రేతమును గౌఁగిలించుకొంటిని. ఖరము నెక్కితిని. శిరమునఁ
దైలము రాచుకొంటిని. అన్నిఁటికంటె నెక్కుడుగమఱియొం
డుగలదు. రక్తకుసుమముల దండను మెడయందుఁ బూని యొ

క్కడ నెందేనిఁ జనుచుంటిని. ఈకలలు నిక్కువములనియే తోఁచుచున్నవి. ఇట్టికలలువచ్చిన మరణముదప్పదందురు. అది యుఁగాక ... ంకొక్కరహస్యముగలదు. వినుఁడు చేతులతోఁ జెవులుమూసికొన్నచో లోనఁగలప్రాణఘోషము వినఁబడకున్న ది.నీళ్లయందుఁ దొంగిచూచినచోఁ దలగానరాకున్నది. అడుగు జాడగానఁబడుటలేదు. చెట్లుబంగారుపు జెట్లుగాఁ గన్నుదోయి కిఁగానబడుచున్నవి. బుద్ధియంతయుఁ గలఁత వహించియున్నది. అక్కటా! యీదుశ్శకునములు నాకు సన్నిహితమరణమును సూచించుచున్నవి. నేను జీవింపఁజాలను. దేహము లనిత్యము లనియెంచి మీరు నామరణమునకై చింతిల్లకుఁడ'ని పలికెను. వారాపలుకులకు ధైర్యమువదలి యేడువఁజొచ్చిరి. కంసుఁడువార లనాశ్వాసించి 'మీకేల భయము? నేనూరక పలికితిని. నా కేటిమరణము? నన్నుఁజంపువాఁడెవఁడు? రేపు నావిరోధులను రామకృష్ణులను వధించెదను. పిమ్మట మరణభయములేక హా యిగ సుఖించెదను. సకలరిపుభయంకరుఁడను నన్నుఁ బతిగఁ గైకొన్న మీకునుదుఃఖమా?ఊరకుండుఁడు. నాజీవితవిషయం బున సందేహమునొందకుఁడ'ని పలికెను. వారలాతని పెడ బుద్ధిమాన్ప ననేకవిధముల యత్నించి తదనుకూలవాక్యంబులు పెక్కులుపలికిరి. అయ్యవివిషంబులుగఁ దోఁపఁ గంసుండుకాం తల నదలించిశయ్యపైనుండి చివాలున లేచి పోయెను. భర్త యంతవార్ధక్యంబు వహించినందుల కాత్మఁగంది యాలలనలు దమలోఁ మనగతు లెట్లుగావలయు నట్లగును. చింతించి యేమి చేయఁగల మ'ని యూరకుండిరి.

అంతలోఁ గొక్కురోకో యని కోడి కూఁత వినఁబడెను.

చీఁకటులు నడలఁ జొచ్చెను. చల్లని పిల్లవాయువు లుల్లాసంబు న వీవఁదొడంగెను. కులాయంబులఁ బక్షులు కలకలఁ గూయు చుండెను. తూరుపు దెల్లవాఱెను. పద్మినీకాంత తా నోచిన నోములు ఫలించె నని సంతసమ్మునఁ బ్రసన్నవదనమ్మును జగమ్మునకుఁ గన్పట్టఁ జేయుచుండెను. ఝమ్మను శబ్దమ్ము సలు దిక్కులఁ గ్రుమ్మఁ దుమ్మెదలమొత్తమ్ములు దామరలయందలి తేనియను ద్రావుచు నానందించుచుండెను. క్రమక్రమముగ భాస్కరుఁ డుదయ మయ్యెను.

అట్టియెడఁ గంసుఁడు గొలువుకూటంబున కరుదెంచెను. దుస్తంత్రంబుల ధరణీతలంబున ననమప్రజ్ఞగొన్న మంత్రు లిరుపార్శ్వంబుల నుచితాసనంబుల నాసీనులై యుండిరి. అప్పుడు కంసుఁడు వారలంగాంచి యమాత్యశేఖరులారా! వింటిరిగదా నామేనల్లుండ్రరాక! వారి నెట్లయిన నిప్పుడు దుదముట్టించు యత్నమొండు సలుపవలయు. మీమనంబుల కెద్దియెద్ది యుక్తమని తోఁచుచున్న యది యద్ది యద్ది వచి యింపుఁడు. మనకు వలసినదాని నవలంబింతము. నాకనేక ములు దోఁచుచున్నవి. అయినను నాకార్యంబునఁ దీర్మాన మొండు గావింప నేను కర్తను గాఁజాల నని పలికెను. ఆని పలుకుల కలరి మంత్రులయందు సమర్థుఁడగు నొక్కరుఁ డిట్లనియె. 'రాజేంద్రా! యిందులకై యింత చింత యేటికి? మన కడలోకము నంతయు జయించిన మల్లు రిరువురు గలరు. వారు చాణూరముష్టికులు. దేవరకు వారలఁగూర్చి తెలియకుండదు. వారల నిరువురఁ బిలువనంపుఁడు. మీ మేనల్లుండ్రను గొనివ చ్చుట కాజ్ఞయొసంగుఁడు. మల్లయుద్ధమును జరుగునట్లు చేస్ప

టుపుఁడు. చాణూరముష్టికులతోడఁ దలఁపడిన తత్క్షణంబరామ కృష్ణులు మరణము నొందుదురు. అటుతరువాత దేవరకు లోకంబునంతయు శాసింప నడ్డుగలుగకుండును'. అన విని తక్కుఁగలవారలెల్ల రది యద్భుతమార్గమని చెప్పి యట్టి మార్గమును వెదకిన మంత్రిని వేనోళ్లఁ బొగడిరి.

కంసుఁడు మంత్రులయాలోచనల కుష్పొంగి యొక రంగమును సిద్ధము గావింప నాజ్ఞాపించెను. స్వామియాజ్ఞ శిర సావహించి మెఱియలవంటిబంటులు గొందఱరిగి యొకస్థలంబును జక్కఁజేయ మొదలిడిరి. నిమిషమాత్రంబులోన నందలిఱాలన్ని యుఁదీయఁబడియెను. కొందఱు సింహాసనమొండు గొనివచ్చి రంగమధ్యమున నమర్చిరి. కొందఱు మేలియాసనంబులఁగొని వచ్చి రాజపీఠంబునకుసమీపమున నేసిరి. మఱికొందఱు నానా న్యాసనంబులఁగొన్నిటిఁనిసమీపస్థలంబులనుంచిరి. రంగమంత యుఁబందళ్లతోనిండియుండెను. పందిటి కంబంబుల కరఁటికం బంబులుగట్టఁబడెను. కన్నులుపండువుసేయుచుండినయారంగం బునఁగంసుఁడుసింహాసనాసీనుండై యుండెను. పరివారమెల్లరాత నిఁబరివేష్టించియుండెను. కంసు నాజ్ఞ యయ్యెను. ఇరువురు మల్లులు మదగజంబుల లెక్కసేయని బలంబులతోడ రంగ మునకు విచ్చేసి భుజాస్ఫాలనము గావించిరి. అప్పుడు కంసుఁడు బలరామకృష్ణులఁ గొని రాఁదగినవారి వారి విడిదల కంపెను. ఇంచుక సేపు లోన రామకృష్ణులు మల్లరంగమునకు విచ్చేసిరి.

వారలం గాంచినంత నే కంసున కనరాని యడలు పుట్టె ను. ఆతనిదేహము గంప మొందఁజొచ్చెను. అయ్యాది వెలికిఁ గానరానీయక యాతఁడతిప్రయత్నంబునఁ దనలో నిట్లని వితె

ర్కింపఁ జొచ్చెను. ఔరా! యేమి వీరిబాహుబలము! ఏమి వీరిచక్కఁదనము! వీరు నిజముగ నాపాలిటి మృత్యుదేవత లని వేఱుగ వక్కాణింపవలయునే. అయినను భయపడ నవస రము లేదు. నామల్లు లసమబలులు. వీరి నిప్పుడ యముని పురి కంపఁగలరు. నాహృదయంబును సంతసంబుననింపఁగలరు. మాత్రముగాక'. ఇట్లనుకొనుచు దిగ్భ్రాంతితోడఁ జూచుచుం డెను.

## పదునైదవ ప్రకరణము.

కంసునిమనంబునకందముగాఁగ జాణూరుండుబాలకులం గాంచి యిట్లనియె. 'డింభకులారా! మీరలు సంగ్రామంబున మిక్కిలి నేర్పరులని పలువురుపలుకవిని వేడుకపడి మారాజేం ద్రుఁడు మిమ్మిందులకు రప్పించెను. మీమల్లావహ వక్రీడానై పుణి నొక్కింతచూపింపుఁడు. అయినను నాకొకింత భయముగనున్నది. నాతోడఁదలపడినవాఁడిదివఱ కెవ్వఁడును జీవంబులతోడ నా హవభూమి వదలఁడయ్యె. మీగతిగూడ నట్టులేయయిన మీతల్లి దండ్రులు మీకై యెంతచింత నొందుదురో యూహింపనలవి గాకున్నది. ఇయ్యది మల్లయుద్ధముగాని నవనీతంబుల ముద్దగా దు'. అనవిని శ్రీహరియాతని దిక్కు మొగంబై యోయి! యేల మమ్ము దెప్పిపొడిచెదవు? నీవన్నట్లు నీముపిన్నవాండ్రము. మాకు సాములులేవు. సత్త్వముగలదని చెప్ప సాహసింపఁజాలము.మీర నసామాన్యులుగారు. లోకభయంకరులరు. మల్లయుద్ధ విశార దులరు. కులిశకర్కశ దేహులరు. మీరాజునకువేడ్క సేయవచ్చి

లేదు. మిత్రుఁడవు ప్రాణసఖుఁడ వైతివి. యెక్కడిది? అయినను బలశాలితో ననుపయోగము లేదనితోఁచెడిని. కార్యమునఁగదా యెవ్వరెవ్వరి శక్తులెట్టివియో తెలియనగును! నేనునీతోడఁబెనఁగెదను. ఈమాయుగ్రజుఁడుముష్టికునితోడఁదలపడెదును. సభ్యులుగలరు. రాజుగలఁడు. మనజయాపజయము లెల్లరకు వేద్యములుగాఁగలవని పలికెను.

అప్పలుకులకుఁజాణూరునకుఁబట్టరానిరోషమువచ్చెను. బొమలు చిట్లించుకొనుచు నతఁడు హరింగాంచి యిట్లనియె. 'గోపాలకులు వట్టిపిటికిపందలు. వారలలో నీవు బాలకుఁడవు. నీకెందుండి యింతగర్వమువచ్చెను? నాతోడఁబోరుటకు నీవెంతవాఁడవు? నీవు నన్నుఁదాకుట తగరు కొండనుదాకినట్లగు. నీవు నన్నెవ్వఁడనుకొంటివి? నాప్రజ్ఞ నీకింతయుఁ దెలియదయ్యెను. శలభంబుమంటఁబడిమడియునట్లునీవునాపైఁబడి మడియుదువు. ఇవిప్రేతలప్రమోలవేయుకుప్పిగంతులుగావు. చాణూరుఁడు స్థాణునిపైతముమెచ్చఁడు. బ్రహ్మయననాతనికొక్క లెక్కలోనివాఁడుగాఁడు. విష్వక్సేనుఁడన నాతనికి నవ్వువచ్చును. జగత్ప్రాణుఁడీఁడుగాఁడని యెఱింగి యాతఁడాతని రమ్మనఁడు. మల్లయుద్ధమన నాతనికి భక్ష్యభోజ్యములు సిక్కినయట్లు. అట్టియతఁడు గోపాలబాలకుపనికిఁ జాలఁడా? ప్రల్లదము లేల పలికెదవు? నేనుబల్లిదుఁడను. లోకమందుఁ బ్రఖ్యాతుఁడను. నాచల్లడముక్రిందదూఱనిమల్లులు లోకమందుమందునకైన లేరు. చలముతోడ నన్నుఁదాకి జలనిధిఁజొరనీకుసాధ్యముగాదు. అటుగాకున్న గోత్రము దండనిలుచుటకును గూడవలనుగాదు. అదియుఁగాదనినఁ గుంభినిక్రింది కేగరాదు. అట్లునుగాదందు వేని మనుజ

సింహుఁడనని నా[మోలములయ నీకుఁదరముగాదు. కానలఁ జొరఁబడఁజాలవు. [పబలరూపుఁడననుచుఁ [బకాశింపఁ జాలవు. నీగర్వంబులు, నీమోసంబులు, నీచేష్టలు నాకడఁబనికిరావు. రణరంగమునుండి శీ[ఘంబుగఁ దలఁగిపొమ్ము' అనుపలుకులా లకించుచు [శీహరియూరకుండెను. వాగ్వాదులకును గార్యవా దులకును భేదమింతియ కదా?

కృష్ణుఁ డూరకుండుటఁజూచి చాణూరుం డాతని మఱి మఱి దూషింపనారంభించెను. 'నాసాహసమునకు నీవుభయ మందుచున్నట్లు తోఁచెడిని. అంతగాక గొల్లవానిపని యిం కెంత? ముసలమ్మల సభల[పజ్ఞలు కంసనాయకుని సభయందు నా[మోల నుపయుక్తమగునే. బాగుగా యోచింపుము. నీమహిమఁజూపింపనియ్యది మధురాపురముగాని వైకుంఠపుర ముగాదు. నీగర్వంబును దెలియఁజేయనియ్యది కంసనరేం[ద కంఠీరవుని సభామంటపముగాని సర్వసంగపరిత్యక్తులును సన్యా సులునువసించు మఠముగాదు. ఆలకించి యానందించుటకు నా బాహునాదముగానికలహభోజనునివీణానాదంబుగాదు.చదురు లాడుట కియ్యది మల్లవి[గహముగాని [పణయ వి[గహము గాదు.నీయిచ్ఛవచ్చినయట్లు సంచరింపనియ్యది వేదాంతవీధి గాదు. తప్పించుకొని పోవ నియ్యది మునిహృదయంబుల యందలి మూలగాదు. ఇక్కడఁ జిక్కితివి. ఎందేగఁగలవు? నీకీనాఁడు చావు నిక్కువము, సంసిద్ధముగమ్ము? ఇట్లనుచు నామల్లుండు పౌరమనోభల్లుండయి వల్లవ వల్లభుని నల్లనఁ జేరఁబోయెను.

రోషానల ధూమంపుఁ బ్రరోహ మోయనునట్లు లాతని శిరమునందొక సన్ననిసిక యొప్పుచుండెను. దిగ్గజకరసన్నిభంబులై యాతని దోర్దండంబులు భయమును గొలుపుచుండెను. ప్రళయాంతకుని దంష్ట్రల యట్లు లాతని మొగంబునఁ గోఱమీసములు మెఱయుచుండెను. ఆతని దేహంబు కాటుకకొండవలె నల్లచాయంగలదై యొప్పుచుండెను.

అంతఁ గృష్ణుండు మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన మల్లసిల్లి బాహునాదంబుఁ గావించెను. ఆధ్వని రోదోంతరాళంబు నిండి ప్రతిధ్వనులెసఁగెను. ఒండొరులు దలపడిరి. పరస్పర ముష్టిపాతంబులు చూపఱకు భయ జనకంబులుగ నుండెను. కృష్ణుఁడా మల్లుని చెట్టఁబట్టి యీడ్చి క్రిందికిఁ ద్రోసెను. వాఁడు గ్రిందఁబడి లేచి కృష్ణునిం బట్టినెట్టెను. హరి మరల నాతని నొక్క ముష్టింబొడిచెను. ఇట్లు కృష్ణచాణూరులొండొరులకుం దీసిపోనకసమరంబుసలుపుచుండిరి. బలభద్రుడు ముష్టికునితోడఁ దలపడెను. వారిరువురు బాహాబాహిఁ బ్రళయాగ్నులయట్లు పోరుచు భీకరరూపులై చెలఁగుచుండిరి.

అట్టి సమయంబున వారిదర్శనంబులఁ గోరుచు నానందించుచుండిన చూపఱులు దమలో నిట్లని తలపోయఁజొచ్చిరి. 'ఆహా! యీకంసరాజేంద్రుని క్రౌర్యము! చక్కఁదనంబుల కెల్లలగు నీకుమారుల నీగిరికఠోరులగు మల్లులతోఁ బెనంగఁజేసెను. ఈతనికిఁగీడుమేళ్లతో నెన్నటికి నగత్యమున్నట్లుదోఁపదు 'యథా రాజా తథా ప్రజా' యనునట్లు సభ్యులు సైత మీాతని వారింపరైరి. ఈడుగానివారల కిట్టిసమరంబు సెల్లునే? ఇయ్యది

శోకకారణముగనే యున్నది. అయ్యో! యీరాజునకు దయ యనునట్టిదో తెలియదు. ఇతఁడేల వీరిని మన్నించును. సభలలోనికి వచ్చుటంజేసి కాదే మనకిట్టి సంకటము గలుగుచున్నయది. అందువలననే సభకుఁబోవఁ జనదు. పోయినచో సభవారల దోషంబు లెఱిఁగి యూరకుండరాదు. తెలిసి తెలియక యేదియేనినొక్కటిపలికినఁ బాపము సంభవించును.

'సభకుఁ బోవఁ జనదు సభవారిదోషంబు
లెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండ యైన నిట్టట్టు వలికినఁ
బ్రాజ్ఞుఁ డైనఁ బొందుఁ బాపచయము'

ఇట్లనేకు లనేకవిధంబుల ననుకొనుచుండఁ గొందఱు మల్లయుద్ధంబుపై దృష్టి నిడి యిట్లనిరి. 'మల్లుఁడు హారికిలోఁబడినె. నేఁడీతనికిఁ జావు నిక్కువము. ఇప్పటికి మనమనంబుల దిగుళ్లు గొంతకొంత మట్టువడినవి'. కొందఱు వారింజూచి 'లోఁబడియుఁ బెగడక మల్లుఁడు హారివక్షంబును మరల నుగ్రముష్టిఁబొడిచెనుగా'! యనుచుఁ జింతించుచుండిరి. 'ఆ! చచ్చెఁ జచ్చె. ఇట్టివాఁడు కృష్ణు నేలయెదిరింపవలయును. భగవంతుఁడతనికిఁ దగినశాస్తిియొనర్చెన'ని కొందఱు చప్పటలు చఱచుచుండిరి. కృష్ణుఁడు చాణూరుని నేలఁబడఁగొట్టి బాహునాదము గావించెను. చాణూరుఁడు నోట ముక్కున నెత్తురొలుకఁ జచ్చెను. బలభద్రుండు ముష్టికుని చేతనెత్తి నేలపైఁ దలపగులమొత్తెను. వాఁడు గాలిఁ గూలు తరువు భంగి నేలఁగూలెను. మల్లులపాట్లుగాంచి 'వీరిని మల్లులువల్లవబాలకులనియెంచిపెనఁగి

యమనాయకునిపురికరిగిరి. మనమిందుంటిమేని యీబాలురుమనలనిలువనీయరు. ఊపిరి యున్న నుప్పమున్నకొని బ్రదుకవచ్చును. ఇందునిలువ సాధ్యముగాదని తక్కుంగల మల్లు లెల్లరు చెల్లాచెదరై పోయిరి. మల్లయుద్ధంబున రామకృష్ణవిజయంబునకెల్ల వారలాశ్చర్యమగ్నమానసులైరి.

---

## పదునాఱవ ప్రకరణము.

చాణూరముష్టిక వధానంతరంబునఁ గంస సభామంటపంబునఁ గలకలధ్వనులు సెలంగెను. కంసుఁడు సభాజనంబుల నెల్లవారించి మంత్రులంజూచి మహాక్రోధంబున నిట్లనియె. 'ఈగొల్లపిల్లవాండ్రను నగరివాకిటికి వెడలఁగొట్టుఁడు. ఈగొల్లలనెల్లఁ బట్టి బంధింపుఁడు. నందునిఁ గారాగారంబునఁ ద్రోయింపుఁడు. వసుదేవుని బ్రదుకనీయకుఁడు. ఉగ్రసేనునిఁ గూల్పుఁడు. ఆలస్యము సలుపకుఁడు. పొండు', అప్పలుకు లాలించి గోపాలబాలుండు కృష్ణుండు లేచిపైకుఱుకు సింగమట్ల కంసునిపై కుఱికెను. పౌరులెల్లఁ దల్లడిల్లిరి. కంసుఁడు ఖడ్గంబుఁ గేలంబూని కృష్ణునెదుర్కొనెను. తార్క్ష్యుండు పన్నగంబుఁ బట్టు లీలంబట్టి కృష్ణుండు కంసుంగ్రిందఁబడఁద్రోసెను. ఆపెట్టు చేరక్తధారలుగారఁ గంసుఁడు ప్రాణంబులం బాసెను. మహాకోపంబున నునికింజేసి హరియాతనికళేబరంబు నీడ్చెను. ఆసమయంబునఁ గంసానుచరులు విజృంభించి గోపాలుఁబట్టుఁడని కృష్ణునిపై కుఱికిరి. బలభద్రుండు వారల నొక్కపెట్టున

యము సదనంబున కనిపెను. ఇవ్విధంబునఁ గృతకృత్యులైన రామకృష్ణులంగాంచి యెల్లరు సంతసంబునం జెలంగిరి. నారదుఁడు మింటఁజేరి గీతము వాడఁదొడఁగెను.

'క॥ చేతులఁ దాళములొత్తుచుఁ
జేతోమోదంబుతోడ సిగముడి వీడం
బాతర లాడుచుమింటను
గీతము నారదుఁడువాడెఁ గృష్ణాయనుచున్ ॥'

ఆకసమునుండి బ్రహ్మరుద్రాదులు కృష్ణునిఁ బొగడిరి. వేలుపులు పుష్పవృష్టులఁగురిపించిరి. దుందుభులు మ్రోసెను.

అట్టిసమయమునఁ గంసకాంతలు దుఃఖాక్రాంతలై యంతము నొందిన తమకాంతునిపైఁబడియెలుంగెత్తి 'హా! నాథా! హా వీరాగ్రేసరా! మహాత్మా! హారాంజేంద్రా! మమ్మెడఁబాసి పరలోకంబునకు నీవొంటిఁబోయితివే. అయ్యో! నిన్నుజూడక మేమొక్కనిమిషమైనఁ బ్రాణములు నిలుపఁగలమా? మమ్మేలనీతోడఁ గొనిచనవైతివి? ఎంతచెప్పినను నీకప్పుడు మాపలుకులురుచింపవయ్యెనే. నాకేమియుభయములేదనిరాతిరిమాతోడనంటివే. దుఃఖించుచుండిన మమ్ములవారించితివే. ఇప్పుడుమేమిట్లేడ్చుచున్నవారింపవేమి? కన్నులుదెఱచియొక్కపలుకైనఁ బలుకవేమి? అక్కటా! యీదుఃఖంబును భరియింపఁజాలమ'ని యూరకవిలపించుచుండిరి. శ్రీకృష్ణుఁడు వారిడగ్గఱి 'యేల మీరేడ్చెదరు? ఆతఁడు మీపలుకులు వాటింపకలోకంబులకుఁ గీడునాపాదించెను. తెలిసితెలిసి తమప్రాణములపైకిఁ దెచ్చుకొన్నవారి నేమిచేయఁగలము? కాలపైప

రీత్య మ'ని పలికి యూరార్చెను. వారు గొంత శాంతించిరి. కృష్ణుండు కంసాదులకుఁ బరలోక సంస్కారంబులు సేయం బనిచెను.

చెఱయందు దేవకీవసుదేవులాత్మజుని సాహసమ్మున కును గంసనాశనమ్మునకును సంతసంబునొందుచుండ హరి వారినిడగ్గఱి బలభద్రసహితుండై ప్రణామంబులుసేసి సంకెలి యలు విప్పించి యిట్లనివచియించెను. 'జననీజనకులారా! మీరుమమ్ముఁ గంటిరిగాని మాబాలచేష్టలు చూచియానంద మొందఁజాలరైతిరి. దానికై చింతిల్లకుఁడు. అది దైవయోగము. తల్లిదండ్రుల కడఁ దనయులుండి యవసరముల కొలఁదిలాలితుల గుచువర్ధిల్లునట్టిమహిమయందఱకుఁ గలుగదు. తనయులఁజూచు చువారిముద్దుముచ్చటలఁగాంచుచు నానందించుపుణ్యముసైత మెల్లరకుఁగలుగదు. ఎవ్వరెవ్వరిప్రాప్తము లెంతలెంతలంతలంత లుగాక యెక్కువలు రమ్మనినవచ్చునే? మాప్రాప్తమట్లుండె. మీ ప్రాప్తమిట్లుండె. ఎవ్వరేమిచేయగలరు? అట్లననేల? నిఖిలపురుషా ర్థహేతువులగు నీమేనులకు మీరు దక్క నెవ్వార లాధ్యులు? నూఱేండ్లకైనను మీఋణంబును దీర్పరాక గునే! పెద్ద లిట్లు పలుకుదురు.

'క॥ చెల్లుబడి గలిగియెవ్వఁడు
దల్లికిఁ దండ్రికిని దేహధనములవృత్తుల్
చెల్లింపఁ డట్టికష్టుఁడు
ప్రల్లదుఁడామీఁదనాత్మపలలాశియగున్॥

క॥ జననీజనకులవృద్ధులఁ
దనయులగురువిప్రసాధుదారాదులనే
జనుఁడుఘనుఁడయ్యుఁ బ్రోవక
వనరును జీవన్మృతుండువాఁడుధరిత్రిన్॥'

అదియునుగాక కారాగారంబుల మీరు మా కారణం బుగఁగంసుచే నధిక బాధలొందితిరి. ఆతని వారింపఁగల శక్తిమా కుండియు వారింపకుంటిమి. మాక్రౌర్యమేమని వచియింపనగు? నిష్కారుణ్య హృదయుల మమ్మేమిచేసినఁ బాపముతీరును? మాతప్పులనన్నింటిని మన్నించి మీరుమమ్ము రక్షింపకున్న మాగతులేమి గావలయు? అని పలికిన హరిపలుకులకలరి దేవ కీవసుదేవులు మోహితులై యక్కుమారుల నంకపీఠంబుల నిడుకొని కౌఁగిలించుకొని వారి వదనంబులు గన్నీటం దడు పుచు నానందించుచుండిరి. ఉగ్రసేనుండుమనుమల నెత్తుకొని యెక్కుంతిముద్దులాడెను. అంతఁ గృష్ణుండుగ్రసేను దిక్కు మొగంబై 'తాతా! దుర్మార్గుఁడు లోకకంటకుఁడు కంసుఁడు గతించెను. ఆతనికై నీవు వగవఁబనిలేదు. లోకములకిప్పుడు శుభంబు సంప్రాప్తంబయ్యెను. మేము యాదవులమగుటంబట్టి తొంటి యయాతిశాపంబున రాజ్యముసేయరాదు. నీవు సత్వ రముగ నేగుదెంచిసింహాసనమెక్కుము. మేము నిన్నుఁ గొలిచి యుండెదము. సకలరాజులును నిన్నుసేవింతురు. దేవతలుసైత మునీకరిం బెట్టుదురు. కంసపక్షుఁపుఁబుడమి నాయకు లెల్లరు నీసన్నిధికి వచ్చునట్టులిప్పుడ దిట్టముఁగావింతును. లెమ్మ' నిపలికి సకలరాజ్యంబునకు నాతనిఁ బట్టాభిషేకము గావించెను. అంత

రామకృష్ణులందుండి బయలుదేరి చెఱలోఁబడియుండు రాజుల నెల్ల విముక్తులఁ గావించి తోడ్కొనివచ్చి వారివారి రాజ్యంబులు వారివారికొసంగి యనిపిరి. రాజులెల్ల రామహాత్ములం గీర్తించుచుఁ దమతమ మార్గంబులం జనిరి.

నందుఁడు మధురానగరంబున మహానందముతో నుండెను. గోవిందుఁడు రాముం గూడుకొని యాతనిం జేరి 'తండ్రీ! పుట్టిపుడమిఁబడినది యాదిగ నిన్నుఁ దండ్రిగను యశోదారోహిణులం దల్లులుగను నెంచి సంతసించుచుంటిమి. మాకన్న తలిదండ్రుల నెఱుఁగము. మీరు మమ్మెంత మక్కువతోడఁ బెంచితిరి? మీ ఋణమును మేమెట్లు దీర్చుకొనఁ గలము? మీకరుణవలన గదా మేమింతవారమైతిమి. బాల్యంబునందలి పోషణమెంతకష్టము. తల్లిదండ్రులకుఁ దక్కనన్యులకది సాధ్యమగునే? మీరు పల్లియకుఁ బోవ నెంచియుండుట నే నెఱుంగుదును. ఇక్కడఁ బనులు విశేషములుండుటం జేసి మేమిప్పుడు మీతోడ రాఁజాలము. ఎక్కడనున్నను నేక్షణమందైనను నేవిధమునైనను నీస్మరణ మానము. పనులు చక్కఁబెట్టుకొని మీకడకు వచ్చెదము. అప్పుడప్పుడు మిమ్ము దర్శింపక మా ప్రాణములు నిలుచునా? అచ్చటి పెద్దల నెల్ల నడిగితిమని చెప్పుఁడు. మా తల్లులకు మా నమస్కారంబులు దెలియఁ జేయుఁడు. మాతోడి బాలుర విశేషముల నడిగితిమని వచియింపుఁడు. మీకుశలవార్తలప్పుడప్పుడు మాకుఁ బంపుచుండుఁడు. పోయిరండ'ని యనేకవస్త్రభూషణంబులొసంగి పదములకెఱఁగెను. బలభద్రుండును నందునకు నమస్కరించెను. నందుఁడు బిడ్డలను మఱిమఱిఁ గౌఁగిలించు

కొని ప్రణయవిహ్వాలుండై కన్నులనుండి బాష్పజలంబులు రాల వల్లవులంగూడుకొని వ్రేపల్లెకుంజనియెను.

పెంపుడుప్రేమ యెంతయెక్కుడు ? రామకృష్ణులవీడి పల్లియకుఁజని నంత రోహిణీయశోదలు నందున కెదురేగుదెంచిరి. నందుఁడువారికిఁ గంసనాశనాదిసమస్తవిషయంబులం దెలిపెను. బిడ్డలనువిడిచియుండ మనసురాక యాతల్లులు వారలం దలంచుకొని యూరక చింతించుచుండిరి. వ్రేపల్లెయెల్లఁజిన్న వోయియుండెను. బహుకాలంబుదనుక గోపకులెల్లరుఁదృప్తిఁ దీరభుజియింపరైరి.

మధురయందు వసుదేవుఁడు పురోహితుని రావించి రామకృష్ణుల కుపనయనాదిక్రియలు యథావిధి జరిగించెను. అంతనాతఁడు వారినిరువురను గురువుకడఁ జదువఁబంపెను. రామకృష్ణులు జగద్గురువులయ్యు భావికాలంబువారలకు గురుశిక్షలేని విద్యయుమఱుగుననున్నదీపమును రాణింపవని తెలుపుట కోయనునట్లు గురుకులవాసముచేయఁబోయిరి. కొలఁదికాలమునఁనే వారలు సంపూర్ణవిద్యను గ్రహించి దుష్టశిక్షణమును శిష్టరక్షణమును గావింపమొదలిడిరి.

మధురయందలిజను లుగ్రసేనుని రాజ్యంబున నధిక సుఖంబు లొందుచుఁదొల్లిఁదారు గంసువలనఁ గొన్నకష్టంబుల నెల్ల మఱచిరి.



# ఉపసంహారము.



కంసుఁడు దొలుతటినుండియుఁ బ్రజలకు హానిగావించుచుఁ బితృకార్యంబులసైతమలక్ష్యముగావించి యప్రమత్తుఁడై మెలంగుచుండెను. తండ్రియాతనికిఁ బ్రజాపీడనంబున నెన్నియో కష్టములు గలుగునని చెప్పెను. వానిచెవులనవి దూరెనా ?

మూర్ఖుఁడుదనకుఁ దానుదెలిసికొనఁజాలఁడు. ఇతరులు సెప్పినవినఁడు. తుదకుఁ జెడును. వానికప్పటికి మేల్లనితోఁచుపనులు ముందు దుర్భరకష్టములకు మూలంబులై నెగడును. ఎఱుకగలవారిఁ జేరి సర్వము నెఱుఁగుచు నెఱిఁగిన దాని ననుష్ఠించుచు నుండువాని నడతలయం దేలలోపము గానబడును? బాలునైననునట్టివానిని లోకులేల ప్రశంసింపరు? 'లోకమున మనమనుగడ శాశ్వతము. మనకు దేనివలనను జావు లేదు. మనల మించి యొకరుండరాదు. ఒకరు మనకుఁ జెప్పవారుగలరా? ఒకరిపలుకులు మనమాలకించిన యవమానమునకుఁ బాత్రులమగుదుమ'ని సంతత మౌర్ఖ్యమును వహించువారి బుద్ధిప్రాబల్యమేమని కొనియాడనగును? ఔరా ! వారలకు వారలేసములు. తుట్టతుదకువారి కసహ్యాజనకపుఁమరణము దక్క మరి యెద్దియులేదు. రావణాదిరాక్షసులును దుర్యోధనాది మూర్ఖులు నట్లీల్గినవారే. వారిచరితలు దలంచుకొన గుండియలవియును.

కంసునకుఁ 'బితృవాక్యమన గడ్డిపఱకతో సమానము. తండ్రిమాటను వినకుంటయకాక యాక్రూరకర్ముఁడు దైవస మని జనకునిఁ గారాగారంబునఁ ద్రోయించెను. ఇంతకంటె నన్యాయముగలదే! తల్లిదండ్రులకంటెఁ బిడ్డల కితరదైవము గలదా? ప్రాతఃకాలమున లేచి యెవ్వఁడు తల్లిదండ్రుల పాదం బుల మ్రొక్కుచుండు వాఁడధన్యుఁడు. అట్టిపుణ్యమేమని పలు కనగు? తల్లిదండ్రులు లేనివారికట్టి పుణ్యముగలుగదు. అదిదై వయోగము. దానిని దాటనెవ్వరిచే నగును? పితృవాక్యపరి పాలనార్థమై గదా రాముఁ డరణ్యమునకేగి యాకలములుదిని మృగములనడును సంచరించుచుండెను. మూర్ఖులకు మహాత్ముల యుపమానంబులు పనికిరావు. తండ్రియెందుఁజచ్చిన వారికేమి? ముదుకండైనంత నాతఁ డుపయోగింపఁడని వారినమ్మకము. తొలుతటినుండియునునయ్యనఘునసహాయము లేకున్నఁదనయు లెట్లు వృద్ధికివచ్చియుందురు? తనయులఁ బోషించుట తలిదం డ్రులకుఁగర్తవ్యమనియుఁ వారువారిఁ బోషింపవలసిన యవస రము లేదనిగొందఱు పెడవాదములు సేయుదురు. కంసనభకు సంబంధించిన యట్టివారికి మెప్పుఁజెప్పమనచే నెట్లగును.?

కంసుని కాలమ్మున జనులనరాని బాధల నొందిరి. సాధువులకనేకకష్టములు గలిగెను. సాధుబాధస్వనాశమునకు మూలబీజము. రాజ్యకార్యములయం దసాధారణప్రజ్ఞ గల వాఁడయ్యును బాదుషా హా! యౌరంగజేబు ప్రజలనుహింసిం చియకదా బేబరుమహాసియునిచే స్థాపింపఁబడిన మొగలాయి రాజ్యమును నాశనముగావించుటకు మూలకారకుఁడయ్యెను.

